

సోవియట్ దేశ సుప్రీం సోవియట్ ఆరవ సమావేశంలో ప్రతినిధులు (చూ. వ్యాసం 32వ పుటలో)

## విషయసూచిక



ముఖచిత్రం : నటి, గాలీనా వొరొనోవ్కావా, కుమారుడు ఆంద్రితో.

వెనుక అట్ట : సమర్ఖండ్‌లోని ఒక మసీదు.

### అనుబంధం

# అంతర్జాతీయ పరిస్థితి గురించి సుప్రీం సోవియట్‌లో షెపిలోవ్ నివేదిక



సోవియట్ భూమి
సంచిక 4

అనుబంధం
ఫిబ్రవరి 25, 1957

# అంతర్జాతీయ పరిస్థితిగురించి సుప్రీం సోవియట్‌లో షెపిలోవ్ నివేదిక

మాస్కో, 12-2-1957 (టాస్)

నేడు సోవియట్ విదేశాంగ మంత్రి డి. టి. షెపిలోవ్, సోవియట్ దేశ సుప్రీమ్ సోవియట్ రెండు సభల సంయుక్త సమావేశంలో అంతర్జాతీయ పరిస్థితి, సోవియట్ విదేశాంగ విధానానికి సంబంధించిన సమస్యలపైన నివేదికను సమర్పించారు. రెండు పరస్పర విరుద్ధ సాంఘిక వ్యవస్థల సహజీవనం, సోవియట్ దేశ విరోధులు చిత్రించడానికి ప్రయత్నిస్తున్నట్లు, సోవియట్ ప్రభుత్వం ప్రస్తుతపరిస్థితిలో తన అవసరం కొద్దీ తెచ్చిన రాజకీయ పన్నుగడకాదనీ, అది సోవియట్ విదేశాంగ విధానంయొక్క పునాదిరాయి అనీ, షెపిలోవ్ ఉద్ఘాటించారు. పాశ్చాత్య రాజ్యాల పరిపాలక వర్గాలలో, రెండు విదేశాంగ విధాన వైఖరుల మధ్య సంఘర్షణ కొనసాగుతున్నదని షెపిలోవ్ అన్నారు. ఎక్కువ దూరదృష్టిగల రాజకీయవేత్తలు, తమ జాతీయ ప్రయోజనాల దృష్ట్యా అంతర్జాతీయ ఉద్రిక్తత సడలడం అవసరమని గుర్తిస్తున్నారు. అయినప్పటికి, 1956 అంతంలో, వారి విధానంలో మరొక విరుద్ధవైఖరిది పైచేయి అయింది. జాతీయ ప్రయోజనాలు, శాంతి, భద్రతల ప్రయోజనాలకంటే తమ స్వార్థ ప్రయోజనాలను ముఖ్యంగా చూచుకొనేటి యీ రెండవ వైఖరిని బలపర్చేవారికి, అంతర్జాతీయ సహకారాన్ని శక్తివంతం చేసే మార్గం రుచింపదన్న విషయం స్పష్టం. అందుకే వారు రెండు మార్గాల్లో — తూర్పు దేశాల్లో జాతీయ విముక్తి ఉద్యమం పైనా, సోషలిస్టు దేశాల మహాసమాజంపైనా — బహిరంగ దాడికి ఉపక్రమించడానికి ప్రయత్నించారు.

## కుట్రలకు, యుద్ధ జూదాలకు సామ్రాజ్యవాదుల పూనిక

సామ్రాజ్యవాదులు, సోషలిస్టుదేశాల శక్తి క్రమంగా వృద్ధి పొందుతున్నదనీ, ఆదేశాల ప్రజల నైతిక, రాజకీయ ఐక్యత పెంపొందు తున్నదనీ, సోవియట్ వ్యవస్థ బూర్జువా పరిపాలన వైపుకు పరిణతిని పొందవచ్చునని చేయబడిన అంచనాలు కేవలము తమ ఊహాకల్పనలేననీ, ప్రాచ్యదేశాల్లో వలస బానిసత్వ విధానాన్ని కాపాడుకొని, సంఘటితం చేసుకొందామంటూ తాము కనిన కలలు ఇసుకపైన కట్టిన మేడలేననీ తెలుసుకొన్నప్పుడు ప్రజా వ్యతిరేక కుట్రలు, యుద్ధజూదాలు అనే విషపూరిత ఆయుధాన్ని ప్రయోగించడానికి పూనుకొన్నారని, షెపిలోవ్ అన్నారు.

బయటి శక్తుల ప్రోత్సాహంతో హంగేరిలో జరిగిన ప్రతి విప్లవ తిరుగుబాటు యొక్క ఓటమి, దురాక్రమణదారుల అపజయము, సామ్రాజ్యవాదుల "బలాధిక్యతా స్థానాల" విధానానికి తీవ్ర వైఫల్యాన్ని కలుగజేస్తున్నాయని షెపిలోవ్ అన్నారు. పెట్టుబడిదారి విధానం నానాటికి బలహీన పడిపోతున్నదనడానికి యిది మరికొంత దృష్టాంతము. హంగెరీ, మధ్యప్రాచ్యాలలోని సంఘటనల పరిణామాలు, కుట్రదారులు, దురాక్రమణదారులు త్వరిత గతిని ఇతర్లకు దూరం కావడమూ, ఓటమిని పొందడమూ, ప్రస్తుత పరిస్థితుల్లో యుద్ధం అనివార్యమైన ప్రమాదం కాదనీ, యుద్ధాలు నిరోధింపబడవచ్చును, పూర్తిగా ఒపివేయబడవచ్చునని, ప్రస్తుతం అంతర్జాతీయ రంగంలోని వివిధశక్తులు ఉన్న విన్యాసస్థితిలో, విభిన్న సాంఘిక వ్యవస్థలు గల దేశాల శాంతియుత సహజీవన విధానం ఒక్కటే యదార్థపరిస్థితుల కనుగుణమైన విధానమనీ 20వ పార్టీ మహాసభ చేసిన సూత్రీకరణలు సక్రమమైనవీ, ఆచరణయోగ్యమైనవనీ ధృవపరుస్తున్నాయి.

## సోషలిస్టు దేశాల మధ్య సోదర సహకారం

షెపిలోవ్ ఇలాఅన్నారు: సోషలిస్టు శిబిరదేశాల మధ్య సోదర సహకారక్రమము ఒక క్రొత్తవిధమైన అంతర్జాతీయ సంబంధాలను రూపొందించింది. సోషలిస్టు శిబిర దేశాలు వివిధ స్థాయిలకు చెందిన ఆర్థిక, సాంకేతిక అభివృద్ధిని పొందాయి. పెట్టుబడిదారి విధాన పరిస్థితుల్లో ఇలాంటి తారతమ్యాలు, ఆర్థకంగా శక్తివంతమైన దేశాలు, అభివృద్ధిని ఎక్కువగా పొందని దేశాలను లోబర్చుకొనేందుకు దారితీసి వుండేవి. సోషలిజం పరిస్థితుల్లో అలాంటి సంబంధాలకు తావులేదు. సోషలిస్టు దేశాల

మధ్య సంబంధాలు, సంపూర్ణ సమానత్వం, భూభాగ అఖండత్వం, జాతీయ స్వాతంత్ర్యం, సర్వసత్తాధికారాలపట్ల గౌరవం, పరస్పర ంతరంగిక వ్యవహారాలలో జోక్యం కల్పించుకొనక పోవడం అన్న ప్రాతిపదికపైన ఆధారపడివున్నాయి. ఒక్కొక్క దేశం యొక్క గత చరిత్రనుబట్టి వచ్చే విభేదాలు, వాటియొక్క విశిష్ట జాతీయ లక్షణాలు, ఆర్థికాభివృద్ధిలో వివిధ స్థాయిలు, యెన్నివున్నా ప్రపంచ సోషలిస్టు వ్యవస్థలో ఉన్నవారు, తమ ముఖ్యప్రయోజనాలదృష్ట్యా ఏకైక ఆదర్శంతో సమైక్యమై వున్నారు. సోషలిస్టు సమాజ నిర్మాణమార్గాన ఆ దేశాలు పురోగమిస్తున్నాయి.

సోషలిస్టు దేశాల మధ్య సంబంధాలు సోదర సహకారం, పరస్పర సహాయ సూత్రాల ప్రాతిపదికపైన ఆధారపడివున్నాయి.

పెంపొందుతున్న సోషలిస్టు శిబిరశక్తి, విడివిడిగా ప్రతియొక్క స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు, సర్వసత్తాధికారానికీ గట్టి గ్యారంటీ. అందువల్లనే ప్రతియొక్క సోషలిస్టు దేశము సోషలిస్టు శిబిరం శక్తివంతమయి అభివృద్ధిని పొందాలన్న ఆసక్తిని ముఖ్యంగా కలిగి వుంటుంది. ఈ విధంగా సోషలిస్టు దేశాల సఖ్యత, వివిధ సోషలిస్టుదేశాల జాతీయ ప్రయోజనాలను స్వతంత్ర దేశాల సమాజం యొక్క, శ్రామిక ప్రజలందరియొక్క సమిష్టి ప్రయోజనాలతో సామరస్య పూర్వకంగా సమ్మిళితంచేసి, శాంతి, ప్రజాస్వామ్యం, సోషలిజం మహాదర్శాల సంపూర్ణ విజయానికి జరుపబడే పోరాటంలో ఐక్యపర్చే, అంతర్జాతీయ శ్రామిక మహత్తర శక్తిని సృష్టిస్తున్నది.

## సోవియట్, చైనీస్ ప్రజల సుస్థిర ఐక్యత

షెపిలోవ్ ఇలా అన్నారు: సోవియట్ దేశానికీ, గట్టి చిత్తస్థైర్యంతో సోషలిజంను నిర్మించుకొంటూ, పురోభివృద్ధి మార్గంలో నడుస్తున్న చైనా ప్రజారిపబ్లిక్‌కూ మధ్యఉన్న మైత్రి సోషలిస్టు శిబిర మహత్తర శక్తికి ఒక ముఖ్యాంశంగా వుంటున్నది. చైనాప్రజల మహావిజయాలను చూచి సోవియట్ ప్రజలమైన మనం యెంతో గర్వపడుతున్నాము. ఈ రెండు సోషలిస్టు మహాదేశాల స్నేహము, సోదర సఖ్యత, అన్నిదేశాల శాంతి భద్రతలకు పెట్టనికోటగా వుండగలవు. ఎందుకనగా, సోదరదేశాలైన చైనా, సోవియట్ దేశాలు నాయకత్వం వహిస్తున్న 90 కోట్ల ప్రజాబలంగల శక్తివంతమైన సోషలిజం కోటపైకి కత్తిని యెత్తడం అంటే వట్టి వెర్రితనంగాక మరేమీ కాబోదు. సోవియట్ దేశం, చైనాదేశాల ప్రజలు సుస్థిర సమైక్యతను పొంది వున్నారు. తాము అన్ని సోషలిస్టు దేశాలతోను సోదరస్నేహం, పరస్పర సహాయం అన్న బాధ్యతలతో బంధింపబడి వున్నామనీ, సోషలిస్టు దేశాలను బలహీన పర్చడానికి ఉద్దేశింపబడిన దౌర్జన్య సామ్రాజ్యవాదశక్తుల కవ్వింపుచర్యలను వేటినైనా స్థిరచిత్తంతో త్రిప్పికొట్టగలమనీ ఉభయ దేశాలు ప్రకటించాయి.

షెపిలోవ్ యీ విధంగా అన్నారు: "కమ్యూనిజంను వెనక్కు నెట్టివేయాల"న్న ఉద్దేశ్యాలను చిట్టచివరికి వదులుకొని, విభిన్న సాంఘిక వ్యవస్థలుగల దేశాల మధ్య శాంతియుత సహజీవన విధానాన్ని అనుసరించడమే వివేకవంతము, సుసాధ్యము అయిన పరిష్కారమని పెట్టుబడిదారి ప్రపంచ పరిపాలక వర్గాలకు జీవితమే సూచిస్తున్నది. అంతర్జాతీయ విధానంలో యీ సూత్రం విజయవంత మయినట్లయితే శాంతి పరిరక్షింపబడి సంఘటితం కాగలదు.

## సోవియట్ ప్రభుత్వం యెలాంటి కవ్వింపు చర్యలకూ రెచ్చిపోదు

శాంతికొరకు నిర్మాణాత్మకమైన ప్రయత్నాలను జరుపమని షెపిలోవ్ తమ ప్రసంగంలో సోవియట్ ప్రభుత్వం తరపున దేశాలను, ప్రభుత్వాలను కోరారు. శాంతియుత సహజీవన సూత్రం అన్న ప్రజాకోర్కె అంతర్జాతీయ రంగంలో విజయాన్ని పొందాలి, అని షెపిలోవ్ అన్నారు. ఈ కోర్కె కనుగుణ్యంగా సోవియట్ ప్రభుత్వము తనవిధానాలలో అత్యంతమైన ఆత్మనిగ్రహాన్నీ, ఓపికను, పట్టుదలను ప్రదర్శిస్తున్నది; ఇకముందు కూడా ప్రదర్శిస్తుంది, ఎలాంటి కవ్వింపులకూ రెచ్చిపోదు. కొత్తచిక్కులు, ఘర్షణలు రాకుండా అరికట్టడానికి ప్రతి అవకాశాన్ని వినియోగిస్తుంది. శాంతి పరిరక్షణకు, అది శక్తివంతం కావడానికి ఆధార భూతమయి ఉన్న ప్రాథమిక సమస్యల పరిష్కారానికి పట్టుదలతో నిరంతరం పనిచేస్తూనే వుంటుంది.

## నిరాయుధీకరణ, సమిష్టి భద్రత-రెండు ప్రధాన సమస్యలు

షెపిలోవ్ ఇలా అన్నారు: అంతర్జాతీయ సంబంధాలకు చెందిన రెండు ప్రధాన సమస్యల పరిష్కారాలకొరకు ప్రయత్నాలను కొనసాగిస్తూ ఉండడం అత్యవసరమని సోవియట్ ప్రభుత్వం భావిస్తున్నది. వీటిలో మొదటిది నిరాయుధీకరణ

సమస్య, రెండవది యూరోపు, ఆసియాలలో సమిష్టి భద్రతను సమకూర్చడం సమస్య. ఈ సందర్భంలో, షెపిలోవ్ తన ప్రసంగంలో, అణ్వాయుధాల నిషేధానికి అంగీకరించడానికి అమెరికా యెల్లప్పుడూ నిరాకరిస్తూ వస్తున్న విషయాన్ని గురించి తెలియజేశారు. ప్రస్తుతం ఉన్న అణు, ఉదజని బాంబుల నిలువలను నిర్మూలించడానికీ, ముమ్ముందు అలాంటివాటి ఉత్పత్తిని అరికట్టే పరిస్థితులను కల్పించడానికీ గూడా అమెరికా నిరాకరిస్తున్నది. యూరోపులో నేగాని, లేక మధ్య, దూరప్రాచ్యంలోనే గాని యేదేశమయినా తన భూభాగంపైన అమెరికా యొక్క అణ్వాయుధ సైనిక దళాలకు తావిచ్చినట్లయితే, దానివల్ల రాగల పర్యవసానాలకు అవే సంపూర్ణ బాధ్యతను వహించగలవని షెపిలోవ్ ఉద్ఘాటించారు.

అణ్వాయుధాలను నిషేధించడానికి బదులు అమెరికన్ అధికారవర్గాలు అణ్వాయుధ యుద్ధప్రమాదాన్ని మరింత ఎక్కువ చేసే మార్గాన్ని అవలంభిస్తున్నాయని, షెపిలోవ్ అన్నారు.

నిరాయుధీకరణ సమస్యను గురించి ప్రస్తావిస్తూ, షెపిలోవ్ మిత్రరాజ్యసమితిపైన ఉన్న ప్రత్యేక బాధ్యతను గురించి నొక్కి చెప్పారు. మిత్రరాజ్యసమితి యీ విషయంలో తన పనిని యెంతవరకు నెరవేర్చిందనడానికి, అది అంతంలేని యెన్ని సమావేశాలను జరిపిందన్నది గుర్తుకాదనీ, సాధింపబడిన నిర్దిష్ట ఫలితాలే సరియైన గుర్తనీ ఆయన అన్నారు. ఈ విషయంలో 1957వ సంవత్సరంలో మిత్రరాజ్యసమితి తగువిధంగా ముందుకు పోకపోయినట్లయితే, అది తన విధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చ లేదు.

అటుతర్వాత షెపిలోవ్, శాంతిని శక్తివంతం చేయడానికి యూరోపు, ఆసియాలలో సమిష్టి భద్రతను చేకూర్చవలసిన ప్రాముఖ్యతను గురించి ఉద్ఘాటించారు.

## అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సులకు ఆరు సోవియట్ ప్రతిపాదనలు

షెపిలోవ్ తన నివేదికలో, అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు, సోవియట్ దేశాల నాలుగు ప్రభుత్వాలు తమ మధ్యప్రాచ్య విధానాలలో యీ దిగువ నుదహరించిన సూత్రాలను అనువర్తింపజేయడానికి అంగీకరించాలంటూ సోవియట్ దేశ ప్రభుత్వం ఫిబ్రవరి 11వ తేదీన చేసిన ప్రతిపాదనలను ప్రకటించారు :

1. వివాదాలను శాంతియుత పద్ధతులద్వారాను, సంప్రదింపులద్వారాను మాత్రమే పరిష్కరించుకొంటూ మధ్యప్రాచ్యములో శాంతిని పరిరక్షించడం.

2. మధ్యప్రాచ్యదేశాల దేశీయ వ్యవహారాలలో జోక్యం కల్పించుకొనకపోవడం; వాటి సర్వసత్తాధికార, స్వాతంత్ర్యాల పట్ల గౌరవం చూపడం.

3. అగ్రరాజ్యాలు పాల్గొనే సైనికకూటములలోకి ఈ దేశాలను లాగడానికి జరుపబడే అన్ని ప్రయత్నాలను పరిత్యజించడం.

4. మధ్యప్రాచ్య దేశాల భూభాగాలనుండి విదేశ సైనిక స్థావరాలను రద్దుచర్చడం. విదేశీసైన్యాలను ఉపసంహరించడం.

5. మధ్యప్రాచ్య దేశాలకు ఆయుధాల సరఫరాను పరస్పరం నిరాకరించడం.

6. మధ్యప్రాచ్యదేశాల గౌరవానికీ, సర్వసత్తాధికారానికీ విరుద్ధంగా వుండే యెలాంటి రాజకీయ సైనిక, లేదా తదితర షరతులు లేకుండా, వాటి ఆర్థికాభివృద్ధికి తోడ్పడడం.

శాంతి, భద్రతలలో అసక్తిని కలిగిఉండి, పై నుదహరించిన సూత్రాలననుసరించి మధ్యప్రాచ్య దేశాలతో తమ సంబంధాలను రూపొందించుకొనదలచే యే ఇతర దేశమైనా యీ ప్రకటనలో భాగస్వామి కావచ్చునని వేరుగా చెప్ప నవసరం లేదు.

మధ్యప్రాచ్యంలో శాంతిని సంఘటిత పర్చాలనే సున్నపూర్వకమైన ఉద్దేశ్యంతో తీసుకొనబడుతున్న యీ చొరవకు అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు ప్రభుత్వాల తోడ్పాటు లభించగలదని సోవియట్ ప్రభుత్వం ఆశిస్తున్నది.

ఈజిప్టులో ఆంగ్లో-ఫ్రెంచి-ఇజ్రాయిల్‌లు జరిపిన దురాక్రమణ ఫలితాలను తొలగించడం విషయాన్ని గురించి ప్రస్తావిస్తూ ఈజిప్టు భూభాగంపైనుండి ఇజ్రాయిల్ సేనల సంపూర్ణ ఉపసంహరణ అన్నిటికంటే అత్యవసర సమస్య అని షెపిలోవ్ ప్రకటించారు. ఈజిప్టు భూభాగాన్ని ఇంకా ఆక్రమించుకొని వుండటంవల్ల కలుగబోయే పర్యవసానాలకు బాధ్యత ఇజ్రాయిల్‌మీదా, దానిపై అధికారం చెలాయించేవారిమీద ఉంటుందన్న విషయాన్ని గుర్తించని వారెవరు ?

## చట్టము, న్యాయము ఈజిప్టు వైపున వున్నాయి

ఈజిప్టుకు కలిగింపబడిన నష్టానికి పరిహారం యివ్వబడాలన్నదాని న్యాయమైన కోర్కెను సోవియట్ ప్రభుత్వము బల

పరుస్తుంది. ఈజిప్టు సర్వసత్తాధికారంనుండి సూయజ్ కాలువను తొలగించి, ఆ నీటి మార్గంపైన ఒక విధమైన విదేశీ పరిపాలనను స్థాపించుటద్వారా ఈజిప్టుయొక్క జన్మహక్కును హరించడాన్ని సోవియట్ ప్రజలు యెల్లప్పుడూ వ్యతిరేకిస్తూ వచ్చారు. ఇప్పుడూ వ్యతిరేకిస్తున్నారు. చట్టము, న్యాయము ఈజిప్టు వైపున వున్నాయి. సూయజ్ కాలువద్వారా స్వేచ్ఛా నౌకాయాన సమస్య దానికి సంబంధించిన దేశాల మధ్య, ఈజిప్టు సర్వసత్తాధికారంపై గౌరవం, కాలువ వినియోగదార్లందరి న్యాయమైన ప్రయోజనాల పట్ల తగుశ్రద్ధఅన్న ప్రాతిపదికపైన సంప్రదింపులద్వారా మాత్రమే పరిష్కరింపబడగలదు.

## ప్రపంచ ఆర్థిక మహాసభ జరుపవలసిన సమయము ఆసన్నమైనది

ఆర్థిక సమస్యలను గురించి, అందులోను ప్రధానంగా ప్రపంచ వాణిజ్యం అభివృద్ధి పొందడానికి అనుకూల పరిస్థితులు సృష్టించడాన్ని గురించి ప్రస్తావిస్తూ షెపిలోవ్ ఇలా అన్నారు: ఈ దిగువ నుదహరించిన సమస్యలను చర్చించడానికి ప్రపంచ ఆర్థిక మహాసభను జరుపవలసిన సమయాసన్నమయినది: అంతర్జాతీయ వాణిజ్యాన్ని ఇంకా పెంపొందించడం, మిత్రరాజ్యసమితి పరిధిలో అంతర్జాతీయ వాణిజ్య సంస్థలను నెలకొల్పడం; బాగా అభివృద్ధిపొందని దేశాలలో స్వతంత్ర జాతీయ ఆర్థిక వ్యవస్థలను సృష్టించడానికి దోహద మివ్వగల అంతర్జాతీయ ఆర్థిక సహకారాన్ని కల్పించడం; ఇంకా కొన్ని ఆర్థిక సమస్యలను గురించి చర్చించడం. ఇలాంటి మహాసభ జరగడం, అంతర్జాతీయ సంబంధాలపైన హితకరమైన ప్రభావాన్ని కలుగజేస్తాయి.

## అగ్రరాజ్యాలపై అంతర్జాతీయ భద్రతా బాధ్యత

షెపిలోవ్ తన నివేదికలో ఇలా చెప్పారు: శాంతిని, అంతర్జాతీయ భద్రతను పరిరక్షించే ప్రధానబాధ్యత అగ్రరాజ్యాలపైన—నాజీ మూకలను ఓడించి, నాగరికతను రక్షించిన చారిత్రాత్మక సంఘటనయొక్క సభ్యులపైన—ఆధారపడి వున్నది. అగ్రరాజ్యాలు—ఈ సంఘటన సభ్యులు—పరస్పర విశ్వాసాన్ని, సత్సంబంధాలను పునఃస్థాపితం చేసుకొన్నట్లయితే, ప్రపంచానికి తీవ్రమైన ప్రమాదం ఇకనేమీ వాటిల్లబోదని మానవాళి తెలుసుకొని కుదుటపడుతుంది. సోవియట్ దేశం ఈవిషయాన్ని దృష్టియందుంచుకొనే అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సులతో పరస్పర అవగాహన కుదరడానికి తోడ్పడగల యే ప్రతిపాదననైనా అనుకూల దృష్టితో పరిశీలించడానికి సిద్ధంగా వున్నది. ఈ సందర్భంలో, జనవరి 23వ తేదీన అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ చేసిన ప్రకటననూ, దానికి ముందురోజు బ్రిటిష్ విదేశాంగ మంత్రి లాయడ్ చేసిన ప్రకటననూ యీ సందర్భంలో గమనించవలసి యున్నది. సోవియట్ దేశం, అమెరికాల మధ్య సంబంధాలను మామూలు స్థితికి తీసుకురావడం సాధ్యమని తెలియజేస్తూ, సోవియట్ దేశం, అమెరికాల సాంఘిక వ్యవస్థలు యెంతటి విభిన్నమయిన వైనప్పటికి, రెండుదేశాల ప్రయోజనాలు యేకమయ్యే ముఖ్య సమస్యలు అనేకం వున్నాయని, సోవియట్ ప్రభుత్వం ఇదివరకటి విధంగానే యిప్పుడుగూడా భావిస్తున్నదని షెపిలోవ్ అన్నారు. శాంతి పరిరక్షింపబడి, శాంతియుత సహకారం పెంపొందింపబడాలని అమెరికన్ ప్రజలు, సోవియట్ ప్రజలు కూడా సమాన ఆసక్తిని కలిగి వున్నారు. ఈ విషయాన్ని దృష్టియందుంచుకొనే మనము సోవియట్ దేశంతో స్నేహ సంధిని చేసుకొనమని అమెరికాను కోరాము. ఈ ప్రతిపాదనను మనము చేసి ఇప్పటికి సంవత్సరం గడిచిపోయినా, ఇంతవరకు యెట్టి సమాధానము రాలేదు. ఇప్పుడు కాకపోయినా, మరి కొంత కాలం తర్వాతనయినా అమెరికాలోని వివేకవంతులు, ప్రశాంత చిత్తులు, అమెరికా-సోవియట్ సంబంధాలను తీవ్రతరం చేయడానికి ప్రయత్నించే అహంభావులపైన విజయాన్ని సాధించగలరని మనము గట్టిగా నమ్ముతున్నాము.

షెపిలోవ్ తన నివేదికలో ఇలా అన్నారు: సోవియట్ దేశానికి, బ్రిటన్‌కూ, సోవియట్ దేశానికి, ఫ్రాన్సుకూగూడా సమిష్టి బాధ్యతలు, సమిష్టి ప్రయోజనాలు ఉన్నాయి. వివాదగ్రస్థమయిన సమస్యలు ఉన్నట్లయితే—అలాంటివి వున్నమాట నిజమే—సమిష్టికృషిద్వారా వాటికి పరిష్కారాన్ని కనుగొనడానికి అడ్డువచ్చేదేమున్నది? బ్రిటన్, ఫ్రాన్సులు సోవియట్ దేశ ప్రయోజనాలను అర్థంచేసుకోడానికి తగు ప్రయత్నం జరిపినట్లయితే, సోవియట్ ప్రజలు, సోవియట్ ప్రభుత్వము బ్రిటన్, ఫ్రాన్సుల న్యాయమైన ప్రయోజనాలను నిస్సందేహంగా అర్థం చేసుకొనడం జరుగుతుంది.

## ఉత్తరాఫ్రికాలో చొరబడబోను అమెరికా ఫ్రెంచివారి పొరపాట్లను వినియోగించుకొంటున్నది

అల్జీరియా సమస్యపైన షెపిలోవ్ యిలా అన్నారు: ఈ విషయంలో మా విధానం సుస్పష్టంగా ఉన్నది. ప్రతిజాతికీ, జాతీయ స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, స్వయంనిర్ణయాధికారాలపట్ల అవిభాజ్యమైన హక్కువున్నదని మేము భావిస్తున్నాము. అల్జీ

రియా ప్రజలకు గూడా యిది సంపూర్ణంగా వర్తిస్తుంది. కాని అదేసమయంలో ఫ్రాన్సు ఆల్జీరియాలమధ్య చారిత్రకంగా యేర్పడిన సువ్యక్తమయిన సంబంధాలను యెవ్వరూ కాదనలేరు. ఈ సంబంధాలు అస్తిత్వంలో వుండడమే ఆల్జీరియా, ఫ్రెంచి ప్రజల ప్రయోజనాలదృష్ట్యా ఆల్జీరియా సమస్యా పరిష్కారానికి అవకాశాన్ని కల్పిస్తున్నది. ఈ అవకాశం ఇంతవరకు యెందుకు వినియోగించుకొనబడలేదు? ఆల్జీరియా సమస్య అత్యవసర అంతర్జాతీయ సమస్యగా యెందుకు తయారు చేయబడింది? ఫ్రెంచి పరిపాలకవర్గాలు, ప్రస్తుత కాలపరిస్థితుల సరళిలోను ప్రజల ప్రయోజనాలదృష్ట్యాను ఆల్జీరియా సమస్యా పరిష్కారానికి చాలా కాలంవరకు మార్గాన్ని అన్వేషించక పోవడం మూలాన ప్రధానంగా ఇది జరిగింది. ఈ విషయంలో వీరి విధానము, అసలే ప్రమాదకరస్థితిలో వున్న ఆల్జీరియా పరిస్థితిని ఇంకా ప్రమాదకరం చేయడానికి దారితీసింది. ఇంకా దానిని ఆ మార్గాన్నే తీసుకొనిపోతున్నది. ఇలాంటి పరిస్థితులు యేర్పడడం అమెరికన్ గుత్త పెట్టుబడిదారులకు గొప్ప అనక్తిని కలుగచేస్తున్నది. ఫ్రెంచి ప్రభుత్వం చేసిన తప్పిదాలు, పొరపాట్లను అదనుగా ఉపయోగించుకొని ఉత్తరాఫ్రికా మండలంలో తాము యింకా అధికంగా చొరుచుకు పోవడానికి వారు ప్రయత్నిస్తున్నారు.

ఆల్జీరియా సమస్య విషయంలో ఫ్రెంచివారు, ఆల్జీరియా ప్రజల జాతీయ ప్రయోజనాలపట్ల, వారి స్వాతంత్ర్య హక్కుపట్ల తగు గౌరవాన్ని చూపుతూ నిర్మాణాత్మకమైన విధానాన్ని అనుసరించవలసి యున్నది. ఈ సరళిలో ఆల్జీరియా సమస్య పరిష్కరింపబడినట్లయితే, అది అంతర్జాతీయ పరిస్థితిలో నిస్సందేహంగా అభివృద్ధిని తీసుకొనిరాగలదు.

## సోవియట్ దేశం, జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్‌ల సంబంధాలలో సంపూర్ణమైన మార్పులు అవసరం

పశ్చిమ జర్మనీ విషయమై ప్రస్తావిస్తూ షెపిలోవ్ యిలా అన్నారు: రకరకాల కవ్వింపుదారుల ప్రయోజనాలకొరకు పశ్చిమ జర్మనీ చేతులు కాల్చుకోవడందేనికి? దురాక్రమణ, అంతర్జాతీయ సాహసచర్యల విధానానికి జర్మనీ తిరిగి యెప్పటికీ మళ్ళకూడదని జర్మన్ ప్రజల చరిత్ర యొక్క గుణపాఠాలు తెలియజేయడం లేదా? జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్ తిరిగి యీ మార్గాన్ని అవలంభించడంవల్ల అంతటినీ గోల్పోవడం తథ్యమనీ, అందువల్ల దానికి లాభం యేమీ ఉండబోదని అనడానికి సందేహం ఏమైనా ఉండగలదా? సోవియట్ దేశానికీ, జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్‌కు మధ్యవున్న పరస్పర అవిశ్వాసం, కొంతవరకు వైరానికీ బదులుగా, విశ్వాసం, స్నేహం యేర్పడేటట్లు పరస్పర సంబంధాలలో ముఖ్యమైన మార్పులు రావాలని షెపిలోవ్ ఉద్ఘాటించారు.

అటుతర్వాత షెపిలోవ్ ఆస్ట్రియా, జపాన్, ఇరాన్, టర్కీ, ఆఫ్ఘనిస్తాన్, ఫిన్లెండ్, స్వీడన్, నార్వే, డెన్మార్క్, ఐస్‌ల్యాండ్‌లతోగల సంబంధాలను సమీక్షించారు.

## ఆసియా దేశాలతో సంబంధాలు బలపడుతున్నాయి

సోవియట్ దేశానికి ఆసియా, ఆఫ్రికాదేశాలతోగల సంబంధాలను గురించి, మధ్యప్రాచ్యంలోని పరిస్థితిని గురించీ షెపిలోవ్ సుదీర్ఘ ప్రస్తావనను చేసారు. ఆయన ఇలా అన్నారు: మిత్రదేశమయిన భారత దేశంతోను, ఇండొనీషియా, ఈజిప్ట్, సిరియా, ఆఫ్ఘనిస్తాన్‌లలాంటి తదితర ఆసియా, ఆఫ్రికాదేశాలతోను సోవియట్ దేశ సంబంధాలు బలపడుతున్నందుకు మేము చాలా ఆనందపడుతున్నాము. కాంబోడియా, సుడాన్, సిలోన్, ట్యునీషియా, లైబేరియా, నేపాల్‌లతో దౌత్య సంబంధాలు స్థాపితంకావడాన్ని మన ప్రజలు హృదయపూర్వకంగా హర్షిస్తున్నారు, ప్రాచ్య దేశాల ప్రజలు కాలదోషం పట్టిన సామ్రాజ్యవాద వలసపెత్తందారీ విధానానికి వ్యతిరేకంగా జరుపుతున్న స్వార్థరహిత పోరాటంపట్ల సోవియట్ ప్రజలు సానుభూతిని ప్రకటిస్తున్నారు.

1956లో దూరప్రాచ్యంలో పరిస్థితి కొంతవరకు బాగుపడిందని షెపిలోవ్ అన్నారు. సోవియట్ దేశం, జపానుల మధ్య మామూలు సంబంధాలు యేర్పడి, రెండు దేశాల మధ్య వ్యవహారసరళి సహకారానికి అవకాశాలు యేర్పడడం, ఈ విషయంలో గొప్ప ప్రాముఖ్యతను కలిగివున్నది.

సోవియట్‌దేశ రాజకీయ వేత్తలకూ, విదేశీ రాజకీయ వేత్తలకు మధ్య వ్యక్తిగత సంబంధాలు బాగా పెంపొందాయి. భారత దేశం, బర్మా, ఆఫ్ఘనిస్తాన్, బ్రిటన్‌లలో బుల్గానిన్, కృశ్చేవ్‌లు జరిపిన పర్యటనల యొక్క ప్రాముఖ్యతను అధికంగా అంచనా వేయడం కష్టం. ఫిన్లెండ్‌లో వొరొషిలోవ్ జరిపిన పర్యటన, ఆసియా దేశాలలో మికొయాన్ జరిపిన పర్యటన, తదితర పర్యటనలు అనుకూల ఫలితాలను కలిగించాయి. సోవియట్ దేశంలో భారత రిపబ్లిక్ ప్రధాని శ్రీ నెహ్రూ, భారత రిపబ్లిక్ ఉపాధ్యక్షుడు శ్రీ రాధాకృష్ణన్, ఇండొనీషియా రిపబ్లిక్ అధ్యక్షుడు శ్రీ సొకర్నో, ఇరాన్ షహిన్షా (రాజు) మొహమ్మద్ రెజా పెహ్లావీ, సిరియా రిపబ్లిక్ అధ్యక్షుడు శ్రీ

కువాత్లీ, బర్మా ప్రధాని శ్రీ యు ను, యమెన్ ఉపప్రధాని మొహమ్మద్ ఎల్ బదార్, కాంబోడియారాజ్యం రాకుమారుడు నరోదమ్ సిన్హ నోక్, జపాను ప్రధాని ఇచరో హతొయామా, ఆఫ్ఘనిస్తాన్ ప్రధాని సర్దార్ మొహమ్మద్ దావూద్ పర్యటనలు ప్రాచ్యదేశాలతో సోవియట్ దేశ సంబంధాలను పెంపొందించడానికి బాగా తోడ్పడ్డాయి.

## ఈజిప్టులో ఆంగ్లో-ఫ్రెంచి పథకాల వైఫల్యం

మధ్యప్రాచ్యంలో పరిస్థితిని గురించి ప్రస్తావిస్తూ షెపిలోవ్ ఇలా అన్నారు: సామ్రాజ్యవాద శక్తులు ప్రాచీన ఈజిప్ట్ భూభాగంపైన ఒక్క ఈజిప్ట్ప్రజలపైననేగాక, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకొరకు పోరాడుతున్న ఆసియా, ఆఫ్రికా ప్రజలు యావన్మందిమీద సమరాన్ని కొనసాగించడానికి నిశ్చయించుకొన్నాయి. అలా చేయడంలో అవి శాంతిని, యావత్ప్రపంచంలోని స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యాలను సవాలు చేసాయి.

కాని వాటి పథకాలన్నీ విఫలమయ్యాయి. యావత్తు అరబ్బు ప్రపంచం తోడ్పాటుతో ఈజిప్ట్ ప్రజలు కొనసాగించిన వీరోచిత పోరాటము, యీ సమస్య విషయంలో సోషలిస్టు దేశాలు, భారత రిపబ్లిక్కు, ప్రపంచంలోని యావత్తు శాంతిప్రియ ప్రజలు అనుసరించిన నిశ్చితమైన స్థిరవిధానము సంఘటనల పరిణామంపై గొప్ప ప్రభావాన్ని కలుగజేసాయి. ఈజిప్ట్పై జరుపబడిన దాడి విఫలమయింది. దాని ఫలితాలు కొన్ని విషయాలను తెలియజేస్తున్నాయి.

దురాక్రమణను ప్రారంభించే పని అప్పజెప్పబడిన ఇస్రాయిల్ మాట అటుంచి, బ్రిటన్, ఫ్రాన్సులే గొప్ప సైనిక అపజయాన్ని పొందాయి. పై నుదహరించిన కారణంవల్లనే, వాటి సైన్యాలు ఈజిప్టు సైన్యాలను లొంగదీసి, తమ దాడియొక్క తక్షణ ఉద్దేశ్యమైన యావత్తు సూయజ్ కాలువ మండల ఆక్రమణను సాధించుకొనలేక పోయాయి. పోర్ట్ సైద్ లాంటి ఒక్క ప్రాంతంపైన గూడా తమ సంపూర్ణాధికారాన్ని స్థాపించుకొనలేక పోయాయి. ఈ విషయమే, అమెరికాలోని పెద్ద "పత్రికా సామ్రాజ్యం", బ్రిటన్, ఫ్రాన్సులు ఇక నెంతమాత్రము అగ్రరాజ్యాలు కాజాలవని గోల చెయ్యడానికి అవకాశ మిచ్చింది.

## ఆర్థికాపజయం, అమెరికాపై అధీనతను అధికం చేస్తుంది

బ్రిటన్, ఫ్రాన్సులు ఆర్థికంగా కూడా అపజయాన్ని పొందాయి. ఎందుకంటే, యుద్ధం వాటి ఆర్థిక ఇబ్బందులను మరింత తీవ్రతరంచేసి, అమెరికాపై వాటి అధీనతను అధికం చేసింది. 1955 లో బ్రిటన్ యొక్క యెగుమతులు, దిగుమతులలో నూటికి ముప్పైపాళ్లు సూయజ్ కాలువగుండా వెళ్లాయన్న విషయాన్ని గుర్తుంచుకొనవలసి యుంటుంది. ఈ కాలువ మూతబడిపోవడంతో ఆ దేశంలోని ఆర్థిక నిర్మాణంలో అనేకమైన క్లిష్టమైన మార్పులు యేర్పడ్డాయి. 1955 లో బ్రిటన్ ఉపయోగించిన నూనెలో నూటికి యెనభై పాళ్లు మధ్యప్రాచ్యం నుండి వచ్చినది, ఇప్పుడు ఆ నూనె దిగుమతి బాగా పడిపోయింది. అయినా, దేశంలోని ఉక్కు ఉత్పత్తిలో నూటికి నలభై వంతులు నూనె ఇంధనం ద్వారానే ఉత్పత్తి చేయబడుతున్నది. నాన్ ఫెర్రస్, రసాయనిక, పింగాణీ, కాగితం, తదితర పరిశ్రమలు గూడా నూనె ఇంధనంతోనే నడుస్తున్నాయి. అనేక ఇతర పశ్చిమ యూరోపియన్ దేశాలవలెనే బ్రిటన్ అమెరికా నుండి అధిక ధరలకు నూనెను కొనక తప్పటలేదు. కాని దీని మూలాన, అసలే అరుదుగా వున్న బ్రిటన్యొక్క డాలర్ నిలువలకు ప్రమాదం వాటిల్లి, అమెరికాపై దాని అధీనత అధికం అవుతున్నది. ఫ్రాన్సుకూడా యీ విధమైన చిక్కు పరిస్థితుల్లోనే పడ్డది.

ఆఖరున, బ్రిటన్, ఫ్రాన్సులు ఈజిప్టుపై జరిపిన యుద్ధంలో తీవ్రమైన నైతిక, రాజకీయ ఓటమినిగూడా పొందాయి.

ప్రాచ్య దేశాలలో వీటి ప్రభావం బాగా బలహీన పడిపోయింది. ఇక ఇస్రాయల్ దురాక్రమణదారుల విషయం. వీరి చర్యలు, అరబ్బు ప్రపంచానికి, దానికి వెలుపల వున్న కోటానుకోట్ల ప్రజలకు ఆగ్రహాన్ని కలిగించాయి.

## సామ్రాజ్యవాదులు అరబ్బులకు వ్యతిరేకంగా కుట్రల నింకా కొనసాగిస్తున్నారు

అరబ్బు ప్రాచ్యంలో వలస పెత్తందార్లు ఆడిన జూదంయొక్క గుణపాఠాలు యివి. కాలానికి అనుగుణంగా నడుచుకోడానికి ఇదివరకు నిరాకరించిన వారికి ఈ గుణపాఠాలు మత్తును వదిలించి యుండవలసిన దనిపిస్తుంది. కాని సామ్రాజ్యవాదులు అరబ్బు ప్రాచ్యానికి వ్యతిరేకంగా, ప్రధానంగా ఈజిప్టు, సిరియా, జోర్డాన్, యమెన్, సౌదీ అరేబియాలకు వ్యతిరేకంగా తమ కుట్రలను కొనసాగిస్తూనే వున్నారు. ఇది శాంతిప్రియ ప్రజలకు భయాన్ని కలిగించక మానదు.

నిప్పుతో చెలగాటం ఇంకా కొనసాగించదలచుకొన్నవారు తమ బహిరంగమైన యుద్ధజూదాలుగాని, రహస్యమైన కుట్రలు

గాని సాంఘిక పరిణామ సూత్రాలను అధిగమింపజాలవని తెలుసుకొనవలసి వుంటుంది. తమ విముక్తికొరకు పోరాటం జరుపుతున్న ప్రజలపైన విదేశీ ఆధిపత్యాన్ని స్థాపించగల శక్తులు ఏవీ లేవు. బాగ్దాద్ ఒడంబడిక, సియాటోలలాంటి దురాక్రమణ సైనిక కూటముల యేర్పాటు, విదేశాలలో సైనిక స్థావరాల స్థాపన, "బలాధిక్యతాస్థానాల" విధానాన్ని వ్యక్తం చేసే తదితర చర్యలు వైరుధ్యాలను తీవ్రతరంచేసి, కాలదోషం పట్టిపోయిన వలస విధాన వ్యవస్థ రద్దు ప్రక్రియను త్వరితం చేస్తుంది. చేసిన వాడే దాని ఫలితాన్ని అనుభవించి తీరుతాడు.

## సోషలిస్టు శిబిరానికి వ్యతిరేకంగా విచ్ఛిన్న చర్యలు

ఈ మధ్య అంతర్జాతీయ అభివృద్ధినిరోధక శక్తులు కూడా సోషలిస్టు శిబిరంపై ప్రత్యక్షంగా విచ్ఛిన్నకర చర్యలను జరిపించాయన్నవిషయాన్ని ఒకసారి గుర్తుకు తెచ్చుకోవాలని, షెపిలోవ్ అన్నారు. ఈ చర్యలు జరిపించడానికి చాలాకాలం క్రితంనుండే సంసిద్ధమవుతూ వచ్చాయి హంగెరీలో ప్రతివిప్లవం విజయాన్ని పొందినట్టయితే, హంగేరియన్ ప్రజానీకంలోని కార్మికులు, కర్షకులు, మేధావులనుండి వేనకువేల మంది హతమార్చబడి, ఫాసిస్టు పరిపాలన తిరిగి యేర్పడేదనుటలో యెట్టి సందేహమూ లేదు.

యూరప్ నడిబొడ్డున యుద్ధానికి ఆటపట్టువుగా హంగెరీ తయారై ఉండేది. హంగేరియన్ సోషలిస్టు కార్మికుల పార్టీనాయకత్వంలో ప్రజలు, సోవియట్ యూనియన్ సహాయంతో ప్రతివిప్లవ కుట్రదారులను వెంటనే తుదముట్టించారు. హంగేరియన్ ప్రజలకు సహాయం చేయుటద్వారా సోవియట్ దేశం, ప్రపంచ శాంతి ప్రయోజనాల కనుగుణ్యంగా హంగెరీ, తదితర సోషలిస్టు దేశాల ప్రజల పట్ల తనకుగల అంతర్జాతీయ బాధ్యతను నెరవేర్చింది.

## బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికాల మధ్య ఘర్షణకు మధ్యప్రాచ్యం రంగమయింది

ప్రధాన పెట్టుబడిదారి దేశాల మధ్య నానాటికీ అధికమవుతున్న వైరుధ్యాలను వివరిస్తూ షెపిలోవ్ ఇలా అన్నారు: అమెరికా, బ్రిటన్ల మధ్య సంఘర్షణ మధ్య ప్రాచ్యంలో పరాకాష్టను పొందింది. యుద్ధానంతర సంవత్సరాలలో అమెరికా బ్రిటన్ను ఈ ప్రాంతంలోని దాని నూనె కీలకస్థానాలనుండి గెంటివేసింది. ఉదాహరణకు 1937 లో అమెరికాకు, మధ్యప్రాచ్యంలో ఉత్పత్తి అయ్యే నూనెలో నూటికి పదమూడుపాళ్లు మాత్రమే లభిస్తుండగా బ్రిటన్కు నూటికి ఎనభైపాళ్లు లభిస్తుండేది. కాని నేడు ఆ పరిస్థితి పూర్తిగా మారిపోయింది. 1956లో మధ్యప్రాచ్యంలో ఉత్పత్తి అయ్యే నూనెలో నూటికి 60 వంతులపైన అమెరికా అజమాయిషీ వహిస్తూవుంటే, బ్రిటన్ అజమాయిషీలో మూడవవంతు మాత్రమే ఉంటూ వచ్చింది.

మధ్యప్రాచ్యం, బలహీనపడిపోయిన రెండు పాత వలస పెత్తందారీ సామ్రాజ్యాలు, బ్రిటన్, ఫ్రాన్సులకూ, వాటికంటే యెక్కువ శక్తివంతమయిన అమెరికన్ సామ్రాజ్యానికీ మధ్య జరుగుతున్న సంఘర్షణకు రంగంగా తయారయింది. సహజంగానే అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సులు అరబ్బు ప్రజలు తమ జాతీయ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కొరకు జరుపుతున్న పోరాటాన్ని అణచివేయాలని కాంక్షించుటలో ఏకాభిప్రాయాన్ని కలిగి వున్నాయి. కాని అమెరికా యీ పనిని, యీప్రాంతంలోని నూనె మూలాధారాలపైన, కీలక స్థావరాలపైన తనకు అంత్యంలో అధికారం లభించే విధంగా చేయాలని కోరుతున్నది. ఈ విషయంలో ఈ మధ్య అమెరికా విదేశాంగ మంత్రి డల్లెస్ చేసిన ప్రకటన ప్రాముఖ్యతను కలిగివున్నది. మధ్యప్రాచ్యాన్ని గురించి మాట్లాడుతూ, డల్లెస్, బ్రిటిష్, ఫ్రెంచి సైనికులు తన ప్రక్కన —ఒకరు కుడిప్రక్కనా, మరొకరు ఎడమప్రక్కనా—ఉండడాన్ని తాను కోరడం లేదని అన్నారు. ఈ ప్రకటన ప్యారిస్లోను, లండన్లోను ఆగ్రహాన్ని కలుగజేసిందని తెలుస్తోంది.

## పరాధీన అరబ్ దేశాలకు అమెరికన్ "సహాయం"

అరబ్ దేశాలకు బూటకపు అమెరికన్ "సహాయం" వాటిని అమెరికన్ పెత్తనం క్రిందికి తేవడానికే ప్రధానంగా ఉద్దేశించబడిందని యీ సందర్భంలో నొక్కి చెప్పవలసివుంది. గడచిన ఏడేళ్ళలోనూ అరబ్దేశాల కివ్వబడిన అన్నిరకాల అమెరికన్ "సహాయం" మొత్తం 13 కోట్ల 60 డాలర్లు మాత్రమే అయితే, ఒక్క అమెరికన్ అరామ్కో నూనె కంపెనీయే సౌదీ అరేబియా సహజ సంపదను దోచుకోవడం మూలంగా సాలుకు 30 కోట్ల డాలర్లకు పైగా సంపాదిస్తూందని చెప్పాలి. తత్ఫలితంగా, ఒక్క అరబ్ దేశంలోనే ఒక్క ప్రయివేటు అమెరికన్ నూనె కంపెనీ సంపాదిస్తున్న లాభాలలో, ఏడాదికి అరబ్ దేశాలకు లభించే అమెరికన్ "సహాయం" నూటికి 5 వంతులకు మించదు.

## మధ్యప్రాచ్యం నుండి బ్రిటన్, ఫ్రాన్సులను తరిమి వేయడానికి అమెరికా ప్రయత్నం

ఈజిప్టుమీద ఆంగ్లో-ఫ్రెంచి-ఇస్రెయిల్ దురాక్రమణ విఫలమైన ఫలితంగా తన పోటీదారులపై అమెరికా ఆధిక్యత మరింత పెరిగింది. ఇప్పుడు, శక్తులయొక్క యీ నూతన అన్యోన్య సంబంధంపై ఆధారపడుతూ అమెరికా మధ్యప్రాచ్యం నుండి బ్రిటన్, ఫ్రాన్సులను పూర్తిగా తరిమివేయడానికి నిశ్చయించుకుంది. "ఐసెన్‌హోవర్ సూత్రం" అనబడేది దీనికి సుస్పష్ట నిదర్శనం. దీని ననుసరించి అమెరికా యీ ప్రాంతాన్ని అనేక అణ్వాయుధ స్థావరాలతో నింపివేయ దలచుకుంది, తన సేనలను ముమ్మరంగా నెలకొల్పదలచింది, అవకాశం చిక్కగానే దురాక్రమణ యుద్ధం యీ ప్రాంతంనుండి ప్రారంభించ దలచుకుంది.

మనిషి తియ్యగా మాట్లాడాలిగాని ఒక పెద్దకర్ర మాత్రం పట్టుకునే వుండాలి, అప్పుడు చాలదూరంపోవచ్చును, అని అమెరికన్ అధ్యక్షుడు థియొడోర్ రూస్‌వెల్టు యీ శతాబ్దారంభంలో అన్నారు. కర్రనూ తేనె మాటలనూ జోడించే యీ పద్ధతి యీ క్రొత్త సూత్రంలోకూడా బాగా చొప్పించబడింది. అయితే అమెరికన్ సామ్రాజ్యవాదుల పథకాలను ఎటువంటి తేనె పలుకులూ మరుగుపర్చలేవు.

అమెరికన్ విదేశాంగ విధానం చరిత్ర వివిధరకాల సూత్రా లనేకం ఎరుగును. గత శతాబ్దాంతంలో కార్యదర్శి హే చైనాలో "ఓపెన్ డోర్స్" విధానాన్ని ప్రకటించాడు. దాని అర్థమేమిటి? చైనాలోని వలస పీడనలో పాల్గొనే హక్కును అమెరికా ప్రకటించడమన్న మాట. ప్రస్తుత "ఐసెన్ హోవర్ సూత్రా"న్ని "అమెరికా ప్రయోజనాలకై మధ్య ప్రాచ్యంలో క్లోస్డ్ డోర్స్ సూత్ర" మనవచ్చును. ఈ ప్రాంతాన్ని కేవలం అమెరికా పెత్తనం క్రిందకు తేవడానికి అది ఉద్దేశింపబడ్డది.

## ఐసెన్‌హోవర్ సూత్రం మిత్రరాజ్య సమితి సూత్రాలకు పూర్తిగా విరుద్ధం

"ఐసెన్ హోవర్ సూత్రం", జాతీయ సర్వసత్తాధికారం, స్వాతంత్ర్యాలపట్ల గౌరవం, ప్రజల స్వయం నిర్ణయాధికార హక్కు అనే మిత్రరాజ్యసమితి సూత్రాలను అమలు పర్చడానికి తోడ్పడుతుందని యీ సూత్ర ప్రతిపాదకులు వాదిస్తున్నారు. అటువంటి వాదనలు ఎవరికోసం ఉద్దేశించబడ్డాయో అర్థం చేసుకోవడం కష్టం; ఎందుకంటే అవి లోక విదితమైన యదార్థాలను తలక్రిందులు చేస్తున్నాయి. నిజానికి "ఐసెన్ హోవర్ సూత్రం" మిత్రరాజ్య సమితి సూత్రాలను తీవ్రంగా ఉల్లంఘిస్తూంది, దానిని అమలు పరచడమంటే మిత్రరాజ్య సమితి రద్దు కావడమన్న మాట; ఎందుకంటే ప్రపంచంలోని యీ ప్రాంతంలో అమెరికా అపరిమితమైన నిరంకుశాధికారాలను చేజిక్కించుకుంటుంది; వాస్తవానికి మిత్రరాజ్య సమితిలో సభ్యత్వమున్న ఆ దేశాలన్నిటి స్వాతంత్ర్యాన్ని హరించి వేస్తుంది.

మధ్యప్రాచ్యంలో కొంత "శూన్యత" ఏర్పడిందని చెబుతూ అమెరికన్ విధానకర్తలు తమ దారుణ వాంఛలను సమర్థించుకునేందుకు ప్రయత్నిస్తున్నారు. "శూన్యత" సిద్ధాంతాన్ని ప్రతిపాదించడం వారి కిది తొలిసారికాదు. దురాక్రమణ ఉత్తర అట్లాంటిక్ కూటమి నిర్మాణాన్ని సమర్థించేందుకు అమెరికా దీని నుపయోగించింది. ఆతరువాత అమెరికా, దురాక్రమణ సియాటో కూటమిని నెలకొల్పినప్పుడు ఆసియాలో యిది ఉపయోగించబడింది. ఇప్పుడు "శూన్యత" మధ్యప్రాచ్యానికి వచ్చినట్టుంది. అమెరికన్ పాలకులు ప్రపంచంలోని ఏదోఒక ప్రాంతంలో కోట కట్టుకోదలచినప్పుడల్లా ప్రతిసారీ "శూన్యత" సిద్ధాంతాన్ని తుడిచి మళ్ళీ వ్రాస్తున్నారన్నది స్పష్టంగా లేదా?

"ఐసెన్‌హోవర్ సూత్రం" పూర్తిగా సామ్రాజ్యవాద స్వభావం గలది. అయితే, దాని కర్తలు తయారుచేసే పథకాలు ఇసకమీద నిర్మింపబడుతున్నవన్నది గమనించడం అసాధ్యం కాదు. వలస వ్యవస్థ పూర్తిగా బలహీనమైపోయింది. ప్రజల జాతీయ విముక్తి, మహోద్యమం కొట్టే గట్టిదెబ్బలకు అదికూలిపోతూంది. మధ్యప్రాచ్యంలో బ్రిటిష్ ఫ్రెంచి వలస వ్యవస్థలు పతనమయ్యే సమయ మాసన్నమయితే అమెరికా యొక్క వలస వ్యవస్థ వాటిస్థానాన్ని ఆక్రమించుకుంటుందని బుద్ధిమాంద్యులైన స్వాప్నికులు మాత్రమే నమ్మగలరు. మధ్యప్రాచ్యంతో సహా ప్రపంచంలో చరిత్రను నడిపించే ప్రధానశక్తి వున్నదనీ, అది ప్రజలనీ సామ్రాజ్యవాదులు మరచిపోతున్నారు.

## మధ్యప్రాచ్యంలో భద్రతకు అన్నిటికంటె తక్షణావశ్యకత ఏర్పడింది

మధ్యప్రాచ్యంలో భద్రతను నెలకొల్పడం విషయమై షెపిలోవ్ ప్రసంగించారు. ఇది అత్యంత ముఖ్యమనీ, తక్షణావశ్యకమనీ, యుద్ధానంతర దశలోని ఘటనలన్నీ నిరూపించాయనీ ఆయనన్నారు. ఈనాడు ప్రపంచం, ఈజిప్టుమీద ఆంగ్లో-ఫ్రెంచి—ఇస్రెయిలీ దురాక్రమణను కళ్ళారా చూసినతరవాత, "ఐసెన్

హోవర్ సూత్రం" ప్రకటింపబడిన తరవాత, యీ విషయానికి అన్నిటికంటె తక్షణావశ్యకత ఏర్పడింది.

మధ్యప్రాచ్య దేశాలకు ప్రమాదం సోవియట్ దేశంనుండి కలుగుతూందని పలుకుబడిగల పాశ్చాత్యవర్గాల ప్రతినిధులు ఆరోపిస్తున్నారు. ఇది సామ్రాజ్యవాదులు నిత్యం ప్రయోగించే ప్రచారపు కుతంత్రమే: మధ్యప్రాచ్య వ్యవహారాలలో సోవియట్ జోక్యమంటూ వారు ఎంతగా గగ్గోలు పెడుతూంటారో, తమ దుష్ట వలసవ్యవస్థను పునరుద్ధరించుకునేందుకూ, ఆ ప్రాంతములో తమ పెత్తనాన్ని సుస్థిరం చేసుకునేందుకూ ప్రయత్నిస్తూ అంతగా వాటిలో తాము జోక్యం కలిగించుకుంటూ వుంటారు.

## మధ్యప్రాచ్యంలో శాంతి పరిరక్షణకు సోవియట్ ప్రతిపాదనలు

కామ్రేడ్ ప్రతినిధులారా! నిన్న సోవియట్ దేశ ప్రభుత్వం "మధ్యప్రాచ్యంలో శాంతిభద్రల గురించీ, ఆ ప్రాంతంలోని దేశాల ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలిగించుకోకపోవడం గురించీ సోవియట్ దేశం, అమెరికా, బ్రిటన్, ఫ్రాంసు ప్రభుత్వాల ప్రకటనకు మూల సూత్రాల"ను ఏర్పరచడానికీ, అంగీకరించడానికీ అమెరికా, బ్రిటన్, ఫ్రాంసు ప్రభుత్వాలకు ఒక ప్రతిపాదన చేసింది.

ఇంతకుముందులాగనే సోవియట్ దేశం మధ్యప్రాచ్య ప్రాంతంలో సుస్థిర శాంతిని నెలకొల్పడానికి, విశ్వాస వాతావరణాన్ని సృష్టించడానికీ కృషిచేస్తూంది. సోవియట్ దేశానికి మధ్యప్రాచ్యదేశాలలో సైనిక స్థావరాలుగాని, లాభాలు సంపాదించేందుకు ప్రత్యేక సౌకర్యాలు (కన్సెషన్లు)గాని లేవు. అది వాటికోసమై ప్రయత్నించడంలేదు; ఈ ప్రాంతంలో ఎటువంటి ప్రత్యేకాధికారాలనైనా (ప్రివిలేజెస్) సంపాదించేందుకు అది ప్రయత్నించడం లేదు. ఎందుకనగా అది సోవియట్ విదేశాంగ విధాన సూత్రాలకు విరుద్ధం. ఆ ప్రాంతపు దేశాల జాతీయ స్వాతంత్ర్యం పటిష్టం కావడంలోనూ, వాటి ఆర్థికాభ్యుదయంలోనూ, సోవియట్ సరిహద్దులకు ప్రక్కనే వున్న మధ్యప్రాచ్యంలో శాంతి విజయంలోనూ సోవియట్ దేశం త్రికరణ శుద్ధిగా ఆసక్తి కలిగివున్నది.

మిత్రరాజ్యసమితి భద్రతాసంఘంలో శాశ్వత సభ్యులుగా వున్న అగ్రరాజ్యాలు—అంటే సోవియట్ యూనియన్, అమెరికా, బ్రిటన్, ఫ్రాంసు దేశాల—సంయుక్త కృషిద్వారా అక్కడ శాశ్వతంగా సుస్థిర శాంతిని నెలకొల్పడం సాధ్యమని సోవియట్ ప్రభుత్వం భావిస్తూంది.

తరవాత షెపిలోవ్, మధ్యప్రాచ్యంలో భద్రతను గురించిన సోవియట్ దేశం, అమెరికా, బ్రిటన్, ఫ్రాంసుల సంయుక్త ప్రకటనకు సోవియట్ దేశ ప్రతిపాదనలకు ఆధారంగా వున్న సూత్రాలను పేర్కొన్నారు.

యూరప్‌లో శాంతికి గట్టి హామీలను కల్పించడమూ, యూరోపియన్ దేశాలన్నిటిమధ్య సుస్థిర ఆర్థిక సహకారానికి అవసరమైన పరిస్థితులను సృష్టించడమూ అనే చాలకాలమై పక్వానికొచ్చిన సమస్యను పరిష్కరించాలని వాంఛించేవారంతా తమ కృషిని బాగా సమైక్యం చేయడం యిప్పటికే అత్యవసరమని షెపిలోవ్ అన్నారు.

అసియాలోనూ, పసిఫిక్ ప్రాంతంలోనూ సమిష్టి భద్రతను పరిరక్షించడానికి మరింత చొరవ తీసుకోవడం కూడా యిప్పటికే అత్యవసరం. చరిత్రాత్మక బాండుంగ్ మహాసభలో పాల్గొన్న ఆసియా, ఆఫ్రికా దేశాలు ప్రపంచశాంతిని పటుతరం చేసేందుకు అమూల్యమైన సేవ చేశాయన్న విషయాన్ని యిప్పుడెవరూ కాదనలేరు. బాండుంగ్ మహాసభలో ప్రకటించబడిన సూత్రాలు నానాటికీ అధికంగా గుర్తించబడుతున్నాయి, బలపర్చబడుతున్నాయి. అనేక విషయాలలో ఆసియాదేశాల ఐక్యత, ఆసియాలో గట్టి సమిష్టి భద్రతా వ్యవస్థ స్థాపనకు దారితీసిందన్నది నిస్సందేహం.

## సైనిక కూటాలకు బదులుగా సమిష్టి శాంతిసంధి

ఆసియా, పసిఫిక్ దేశాలు ఆ ప్రాంతంలో వున్న సైనిక కూటాలను రద్దుచేసి వాటి స్థానంలో ఒక సమిష్టి శాంతి సంధి చేసుకోవాలని భారత రిపబ్లిక్, చైనా ప్రజారిపబ్లిక్ ప్రభుత్వాధిపతులు చేసిన సూచనకుగల ప్రాముఖ్యాన్ని యీ సందర్భంలో మరొకసారి నొక్కి చెప్పడం అవసరం. ఈ సమస్యా పరిష్కారం కేవలం ఆ ప్రాంతపు రాజ్యాల మీదనే ఆధారపడి వున్నట్లయితే అసియా, పసిఫిక్ ప్రాంతంలో ఒక సమగ్రమైన సమిష్టి శాంతి వ్యవస్థ ఏనాడో సృష్టింపబడేదన్నది నిస్సందేహం.

ఆఫ్ఘనిస్తాన్‌తోగల మంచి యిరుగుపొరుగు స్నేహసంబంధాలను మనం సంతృప్తితో గుర్తిస్తున్నాము. పరస్పర ప్రయోజనాలపట్ల గౌరవం ప్రాతిపదికమీద అవి జయప్రదంగా పెంపొందుతున్నాయి. ఆఫ్ఘనిస్తాన్ తాటస్థ్యమూ, దురాక్రమణ సైనిక కూటాలలో పాల్గొనకపోవడమూ అనే విధానాన్ని అనుసరిస్తున్న

శాంతికాముక దేశం. అటువంటి విధానం సోవియట్ దేశ తదితర సకల శాంతికాముక దేశాల ప్రజల మద్దత్తునూ, ఆమోదాన్నీ చూరగొంటున్నది. మిత్రదేశమైన అఫ్ఘనిస్తాన్‌కు తన అభ్యుదయ పథంలో నూతన విజయాలు సిద్ధించాలని మన హృదయపూర్వక ఆకాంక్ష.

తన నివేదిక ముగింపులో షెపిలోవ్ యిలా అన్నారు: మానవ స్వేచ్ఛ, ప్రజల సమానత్వమూ, సౌభ్రాతృత్వం సూత్రాలు ప్రపంచమంతటా విజయం పొందుతాయనే నమ్మకంతో మనం మన శాంతియుత విదేశాంగ విధానాన్ని దృఢంగా, పట్టు విడువకుండా అనుసరిస్తాము.

సామ్రాజ్యవాద దేశాల పాలకవర్గాలకు మన మిలా చెబుతున్నాము: మనం ప్రత్యక్షంగా సర్వత్రా నిరాయుధీకరణను అమలు జరుపుదాము. అధునాతన వినాశనకర యుద్ధ సాధనాలను శాశ్వతంగా నిర్మూలించి, నిషేధించుదాము. మనం వ్యాపారమూ, శాస్త్రవిజ్ఞాన, సాంస్కృతిక విలువల ఆదానప్రదానాలూ జరుపుదాము. ఏ సాంఘిక వ్యవస్థకు భవిష్యత్తుగలదో శాంతియుత కృషి ద్వారా, ఆర్థిక పోటీద్వారా నిరూపిద్దాము.

పట్టుదలగా మనం సాగించే శాంతియుత ప్రయత్నాలను ప్రధాన పాశ్చాత్య రాజ్యాల పాలకవర్గాలు తీవ్రంగా ప్రతిఘటిస్తున్నంతకాలమూ మనం మన యశోవంతమైన సాయుధ బలాలను శక్తివంతం చేసేందుకు మంచి శ్రద్ధ వహిస్తాము. మన చేతితో గట్టిగా తుపాకిని పట్టుకుని వుంటాము. ఒక్క తుపాకి మాత్రమే కాదు. ఈ పరమాణుయుగంలో, జెట్ ప్రొపల్షన్, ఎలక్ట్రానిక్స్, టెలి మెకానిక్స్ యుగంలో మన ఆర్థిక, సాంకేతిక, శాస్త్ర విజ్ఞాన, సైనిక సంపత్తిలో పాత తుక్కు వుండకూడదని కూడా మనకు బాగా తెలుసును.

దీనిని జ్ఞాపకం పెట్టుకుని మనం, మన ప్రజల సౌఖ్యం కోసమై, శాంతికి, సర్వతోముఖ సాంఘికాభ్యుదయానికీ కమ్యూనిస్టు సమాజం నిర్మించేందుకై మన మహత్తర సృజనాత్మక కృషిని ప్రశాంతంగా, ఆత్మ విశ్వాసంతో కొనసాగిస్తాము.



# ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ, బెంగాలీ భాషలలో మాస్కో రేడియో ప్రసార కార్యక్రమం

| | | |
|---|---|---|
| 1. ఇంగ్లీషులో | 14.00—14.15 | ఇండియన్ స్టాండర్డ్ టైమ్ |
| | 16—19 | ఎమ్. బి. |
| 2. ఇంగ్లీషులో | 17.00—17.15 | ఇ. స్టా. టై. |
| | 16-19-25 | ఎమ్. బి. |
| 3. ఇంగ్లీషులో | 19.30—20.15 | ఇ. స్టా. టై. |
| | 16-19-25 | ఎమ్. బి. |
| 4. హిందీలో | 14.15—14.30 | ఇ. స్టా. టై. |
| | 16—19 | ఎమ్. బి. |
| 5. హిందీలో | 21.15—21.45 | ఇ. స్టా. టై. |
| | 16-19-25 | ఎమ్. బి. |
| 6. ఉర్దూలో | 14.45—15.00 | ఇ. స్టా. టై. |
| | 16—19 | ఎమ్. బి. |
| 7. ఉర్దూలో | 19.15—20.00 | పశ్చిమ పాకిస్తాన్ స్టా. టై. |
| | 16-19-25 | ఎమ్. బి. |
| | 20.15—21.00 | ఇ. స్టా. టై. |
| | 16-19-25 | ఎమ్. బి. |
| 8. బెంగాలీలో | 14.30—14.45 | ఇ. స్టా. టై. |
| | 16—19 | ఎమ్. బి. |
| | 15 30—15.45 | తూర్పు పాకిస్తాన్ స్టా. టై. |
| | 16—19 | ఎమ్. బి. |
| 9. హిందీలో | 18.30—18.45 | ఇ. స్టా. టై. |
| | 16—19 | ఎమ్. బి. |
| 10. బెంగాలీలో | 18.45—19.30 | ఇ. స్టా. టై. |
| | 16-19-25 | ఎమ్. బి. |
| | 19.45—20.30 | తూర్పు పాకిస్తాన్ సా. టై. |
| | 16-19-25 | ఎమ్. బి. |

మాస్కో రేడియో కార్యక్రమం ప్రతిరోజు ప్రసారం అవుతుంది. మా కార్యక్రమాల్లో సోవియట్ దేశం, తదితర దేశాల్లోని ప్రజాజీవిత వార్తలు, సోవియట్ దేశ జీవితం, ప్రపంచ వ్యవహారాలపై వ్యాఖ్యానాలు, సోవియట్ పత్రికావార్తల సమీక్షలు వినగలరు. శాంతిని బలపర్చి, అంతర్జాతీయ సహకారాన్ని పెంపొందించడానికి ఉద్దేశింపబడుతున్న సోవియట్ ప్రభుత్వ విధానం మాస్కో రేడియోలో విశదపర్చబడుతుంది. నూతన యుద్ధ ప్రమాదానికి వ్యతిరేకంగా, ప్రపంచంలోని అన్ని ప్రాంతాల శాంతిప్రియ ప్రజలు జరుపుతున్న కృషికూడా యీ కార్యక్రమాల్లో వివరింపబడుతుంది.

కార్యక్రమంలో ప్రతిరోజు సంగీతం ఒక అంశంగా ఉంటుంది.

హిందీలో శనివారంనాడు, బెంగాలీ, ఉర్దూ, ఇంగ్లీషలలో సోమవారంనాడు "సోవియట్ వారం" అను కార్యక్రమం ప్రసారం చేయబడుతుంది. వారం పొడుగునా సోవియట్ దేశములో జరిగిన ప్రధాన సంఘటనలు ప్రత్యక్షంగా రికార్డుచేయబడి యీ కార్యక్రమంలో ప్రసారం చేయబడుతాయి.

హిందీలో బుధవారంనాడు, ఇంగ్లీషు, ఉర్దూలలో గురువారంనాడు, బెంగాలీలో శుక్రవారం నాడు మాస్కో రేడియో ప్రజాస్వామ్య శిబిరదేశాలకు సంబంధించిన ఒక ప్రత్యేక కార్యక్రమాన్ని ప్రసారం చేస్తుంది.

ఇంగ్లీషులో శుక్రవారంనాడు, ఉర్దూ, బెంగాలీలలో బుధవారంనాడు సోవియట్ దేశంలోను, ఇతరదేశాల్లోను జరిగిన వ్యాయామక్రీడలకు సంబంధించిన వార్తలు తెలుపబడుతాయి. ఆ క్రీడలకు సంబంధించిన రికార్డింగులు కూడా ప్రసారం చేయబడుతాయి.

శనివారంనాడు ఇంగ్లీషు, బెంగాలీ భాషలలో పాఠకుల లేఖల కార్యక్రమం ప్రసారం చేయబడుతుంది. ఈ కార్యక్రమములో పాఠకుల లేఖలకు సమాధానాలు, పాఠకులు కోరిన సంగీతము ప్రసారం చేయబడుతాయి. ఈ పాఠకుల లేఖల కార్యక్రమం హిందీలో మంగళవారాలలో నెలకు రెండు పర్యాయాలు, ఉర్దూలో శుక్రవారాల్లోను జరుగుతుంది.

ఆదివారాల్లో అన్నిభాషలలోను సాహిత్య కార్యక్రమాలు, కళాప్రదర్శనల ప్రత్యక్ష రికార్డింగులు ప్రసారం చేయబడుతాయి. ఈ కార్యక్రమంలో రష్యన్, ఆధునిక సోవియట్ సాహిత్య రచనలు, విదేశీ రచయితల రచనలు, రష్యన్, ఆధునిక సోవియట్ వాగ్గేయకారుల సంగీతము, ప్రాచ్యదేశాల సంగీతము, జానపద గేయాలు, ఇతర దేశాల శాస్త్రీయ, ఆధునిక సంగీతము శ్రోతలకు పరిచయం చేయబడుతాయి.

శ్రోతల వ్యాఖ్యానాలు, సంగీతంకొరకు కోరుతూ వ్రాసే ఉత్తరాలు, మాస్కో రేడియోకొరకు, రేడియో కేంద్రం, మాస్కో, భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచార శాఖ, 25, బారాకంబా రోడ్, పోస్టుబాక్సు నెం. 241. కొత్త ఢిల్లి-1 కి వ్రాయాలి.

సంపుటి 8
సంచిక 4

# సోవియట్ భూమి

ఫిబ్రవరి, 25
1957

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖచే తెలుగు, హిందీ, ఉర్దూ, బెంగాలీ, తమిళం, మలయాళం, పంజాబీ, మరాఠీ, ఒరియా, ఇంగ్లీషు భాషలలో ప్రచురింపబడుతోన్న సచిత్ర పక్ష పత్రిక



## జాతీయాభివృద్ధిపై నివేదిక

కొన్ని అంకెలు శుభవార్తలుగా ఉంటాయి. హృదయాన్ని ఆనంద పారవశ్యంలో ముంచివేస్తాయి. ఆరవ పంచవర్ష ప్రణాళిక ప్రథమ సంవత్సరమయిన 1956 లో పరిపూర్తి చేయబడిన ప్రభుత్వ ఆర్థిక పథకాల విషయంలో సోవియట్ దేశ కేంద్ర స్టాటిస్టికల్ సంస్థ ఈమధ్య ప్రకటించిన సంఖ్యలు, సోవియట్ ప్రజలకు అలాంటివే. కొన్ని ఫలితాలను ఇక్కడ యిస్తున్నాము.

జాతీయ ఆర్థికవిధానానికి వెన్నెముక అయిన పరిశ్రమల ఉత్పత్తి అనుకున్న లక్ష్యానికి మించిపోయింది. గత పన్నెండు మాసాలలో వీటి మొత్తం ఉత్పత్తి 1955 కంటే 11 శాతం యెక్కువయింది. ఇప్పుడు సోవియట్ దేశంయొక్క పారిశ్రామికోత్పత్తి యుద్ధాత్పూర్వపు 1940 సంవత్సరంకంటే 3.5 రెట్లు, ప్రథమ పంచవర్ష ప్రణాళిక ప్రారంభ సంవత్సరమయిన 1929 నాటికంటే 23 రెట్లు యెక్కువయింది. గతంలోవలెనే, ఇప్పుడు సర్వదా ఉత్పత్తిరేటు అధికం కావడం సోవియట్ ఆర్థిక విధానంయొక్క విశిష్ట లక్షణాల్లో ఒకటిగా వుంటున్నది.

భారీ పరిశ్రమల్లో గొప్ప అభివృద్ధి కలిగినందుకు సోవియట్ ప్రజలు ప్రత్యేకించి మహదానందాన్ని పొందుతున్నారు. గత సంవత్సరము ఉత్పత్తి 11.4 శాతం అధికమయింది. ఈ సంఖ్య దేశంయొక్క పెంపొందుతున్న పారిశ్రామిక శక్తిని సూచిస్తుంది. 1956 లో మొత్తం ఉక్కు ఉత్పత్తి 48.6 మిలియన్ల టన్నులు జరిగింది. అదే 1955 లో 45.3 మిలియన్ల టన్నులు, 1954 లో 41.4 మిలియన్ల టన్నులు ఉత్పత్తి అయింది. బొగ్గు 429 మిలియన్ల టన్నులు ఉత్పత్తి అయింది. అదే 1955 లో 391 మిలియన్ల టన్నులు మాత్రమే ఉత్పత్తి అయింది. పెట్రోలు ఉత్పత్తి 1955 లోని 70.8 మిలియన్ల నుండి 1956 లో 83.8 మిలియన్ల టన్నులకు పెరిగింది. ప్రస్తుతం బొగ్గు, పెట్రోలు ఉత్పత్తిలో యేటేటా అధికమవుతున్న మొత్తం, విప్లవానికి పూర్వం రష్యాలో యేటేటా అవుతూవచ్చిన యావత్తు ఉత్పత్తి కంటే యెక్కువగా వుంటున్నది.

ఒక దేశంయొక్క ఆర్థిక సంపదా, దానియొక్క ఆర్థిక, సాంకేతిక స్వాతంత్ర్యం కేవలం లోహ, ఇంధన ఉత్పత్తులపైననే ఆధారపడి ఉండదు. దాని ఇంజినీరింగ్ పరిశ్రమయొక్క అభివృద్ధిపైన గూడా అది ఆధారపడి వుంటుంది. సోవియట్ ఇంజినీరింగ్, లోహ పని పరిశ్రమల మొత్తం ఉత్పత్తి యుద్ధానికి పూర్వపు ఉత్పత్తికంటే అయిదింతలు పెరిగింది. ఈ అభివృద్ధి ఉత్పత్తి మొత్తంలోనేగాక, శ్రేష్ఠతలోగూడా సాధింపబడింది. ఈ పరిశ్రమ ఉత్పత్తి చేసిన అనేక రకాల యంత్రాలలో టర్బయిన్లు, జనరేటర్లు, అన్ని విధాలైన ఎలక్ట్రికల్ ఇంజన్లు, మోటార్లు, విమానాలు, మోటారుకార్లు, ట్రాక్టర్లు, రైల్వే ఇంజన్లు, వ్యవసాయ యంత్రాలు, క్లిష్టమైన సున్నిత పరికరాలు, అన్ని విధాలైన పరిశోధనా పరికరాలు, ఇంకా తదితర యంత్రాలు ఉన్నాయి.

యంత్ర—పరికరాల పరిశ్రమ ఇంజినీరింగ్ పరిశ్రమలో ఒక ప్రధాన విభాగము. యుద్ధానికి పూర్వం సోవియట్ పరిశ్రమ యేడాదికి 40 నుండి 50 వేలవరకు యంత్ర—పరికరాలను ఉత్పత్తి చేస్తుంటే సోవియట్ ప్రజలు సగర్వంగా ఇలా అనుకొనేవారు: "గతంలో మేము యంత్ర—పకరిరాలను ఉత్పత్తి చేసేవాళ్ళము గాము. ఇప్పుడు ఉత్పత్తి చేస్తున్నాము." 1956 లో వివిధరకాలైన లోహపు—కోత లేత్ యంత్రాల ఉత్పత్తి 121 వేల యూనిట్ల సంఖ్యకు పెరిగింది. ఈ ఉత్పత్తి చేయబడిన వాటిలో అధునాతన క్లిష్ట యంత్రాలు గూడా ఉన్నాయి. కాని దేశం ఒక మహత్తర పారిశ్రామిక శక్తిగా రూపొంది యుండడం మూలాన యీ అభివృద్ధి సహజమైన విషయంగా ఇప్పుడు పరిగణింప బడుతున్నది. ఒకప్పుడు కలలుగా వుండిన విషయాలు యిప్పుడు వాస్తవమయ్యాయి.

జాతీయార్థికాభివృద్ధియొక్క వార్షిక నివేదిక, అన్ని ఆర్థికశాఖలలోను, అందులోను ప్రధానంగా పరిశ్రమల్లో, ముఖ్యమైన సాంకేతికాభివృద్ధి సాధింపబడినట్లు తెలియజేస్తున్నది. పెద్దపెట్టున పాతయంత్రాల స్థానంలో కొత్త యంత్రాలు యేర్పాటు చేయబడుతున్నాయి. అత్యంత అధునాతనమైన పరికరాలు, సాంకేతిక విషయాలు ప్రవేశపెట్టబడుతున్నాయి. ఈ పరికరాల సహాయంతో అత్యున్నత సమర్థతతో పని నడుపబడుతున్నది. ఉదాహరణకు, దుక్కఇనుము, ఉక్కుపరిశ్రమలో ఇదివరకటినుండీ ఉంటున్న అవకాశాలనుండే ఎక్కువ ఉత్పత్తి సాధింపబడింది. ఒక్క సంవత్సరకాలంలో 1,500 ఆటోమేటిక్, కన్వేయర్ ఉత్పత్తి లైనులు స్థాపింపబడి వాటిపై పని ప్రారంభింపబడింది. అనేకవందల కొత్తరకాల యంత్రాలు, పరికరాలు పెద్దపెట్టున ఉత్పత్తి గావింపబడుతున్నాయి. గత పన్నెండు మాసాల కాలంలో అనేక కొత్తవిషయాలు కనిపెట్టబడ్డాయి. ఉదాహరణకు, శాంతియుత ప్రయోజనాలకు అణుశక్తి పెద్దపెట్టున వినియోగింపబడుతున్నది; రేడియో ధార్మిక అణువు సోవియట్ కార్మికులకు, సాంకేతినిపుణులకు, దుక్కఇనుము, ఉక్కు పరిశుభ్రంచేసే ప్రక్రియలో అభివృద్ధిని సాధించడానికి, ఉత్పత్తికి సంబంధించిన సాంకేతిక విద్యను అభివృద్ధికి తీసుకురావడానికి సహాయపడుతున్నది. వైద్యశాస్త్రంలోను, పరిశోధనలలోను రేడియో ధార్మిక ఐసోటోపులు విస్తృతంగా వినియోగింపబడుతున్నాయి.

(మిగత 40వ పుటలో)



డెహ్రాడూన్‌లో సైనిక కళాశాలవద్ద ఒక సైనిక విద్యార్థితో కరచాలనం చేస్తూ మార్షల్ ఝుకోవ్



గూర్ఖాల సంప్రదాయకాయుధమైన కృపాణాన్ని లెఫ్టినెంట్ కలనల్ పి. యస్. థాపా, మార్షల్ ఝుకోవ్‌కు బహూకరిస్తూ

# భారత
# మార్షల్

డెహ్రాడూన్‌లోని 58 గూర్ఖా శిక్షణ కేంద్రానికి మార్షల్ ఝుకోవ్ విచ్చేసినప్పుడు, లెఫ్టినెంట్ జనరల్ కె. యస్. తిమ్మయ్య జి.వో.సి. ఇన్-సి, ఈస్ట్రన్ కమాన్డ్, ఆయనను అనుగమించారు. బయొనెట్ ఛార్జి చేసేటప్పుడు రైఫుల్ ఎలా పట్టుకోవాలో చూపుతున్నారు మార్షల్ ఝుకోవ్ (ప్రక్క చిత్రంలో, కుడి చిత్రంలో)





జనవరి 27న, ప్రధాని నెహ్రూతో ఎన్.సి.సి. ర్యాలీవద్ద (దిగువన కుడిచిత్రం)

మార్షల్ ఝుకోవ్, వారి బృందం శిక్షణా తరగతులు నడుస్తుండడం ప్రతీక్షిస్తూ (దిగువ)







డెహ్రాడూన్ సైనిక కళాశాల విద్యార్థులతో



షహరన్‌పూర్‌లోని రిమౌంట్ డిపో కమాన్డెన్ట్ లెఫ్టినెన్ట్ కలనల్ నెగికి ట్రాఫీని, సోవియట్ దేశంలో అశ్వ ప్రజననము అశ్వ శిక్షణకు సంబంధించిన గ్రంధాలను బహూకరిస్తూ

# దేశంలో ఝుకోవ్



షహరన్‌పూర్ రిమౌన్ట్ డిపోలోని ఒక అశ్వాన్ని పరీక్షిస్తూ



లెఫ్టినెన్ట్ కలనల్ నెగితో(ఎడమ)



క్రొత్త ఢిల్లీలోని, హైద్రాబాదు భవనంలో మార్షల్ ఝుకోవ్ చేసిన విందులో ప్రధాని నెహ్రూ, ఉపాధ్యక్షుడు ఎస్. రాధాకృష్ణన్, భారత దేశంలోని సోవియట్ రాయబారి ఎం. మెన్షికోవ్



డెహ్రాడూన్‌లో మార్షల్ ఝుకోవ్ గౌరవార్థం గూర్ఖాబాలురు వ్యాయామ ప్రదర్శన నిచ్చినప్పుడు



చెకొస్లొవేకియా ప్రధాని విలియం సిరోకీ, సోవియట్ దేశ మంత్రివర్గాధ్యక్షుడు ఎన్. ఏ. బుల్గానిన్, మాస్కోలోని భారత రాయబారి కె.పి.యస్. మీనన్‌తో, జనవరి 26న భారత రాయబార కార్యాలయంలో జరిగిన విందులో

# సోవియట్ దేశంలో భారత రిపబ్లిక్ దినోత్సవం

"సోవియట్ స్త్రీ పురుషులందరూ భారత ప్రజలపట్ల సోదర మైత్రీ భావమూ, సౌభాగ్యవంతమైన స్వతంత్ర శాంతికాముక భారత దేశాన్ని నిర్మించడానికి వారు సాగించే పోరాటంపట్ల ప్రగాఢ సానుభూతీ కలిగి వున్నారు. వారు భారత ప్రజలకు, వారి జాతీయ దినోత్సవ సందర్భంలో హృదయపూర్వకమైన అభినందనలు పంపుతూ, వారి సృజనాత్మక కృషిలోనూ, దేశాలమధ్య శాంతికై వారు సాగించే పోరాటంలోనూ ఇతోధిక విజయాలను కాంక్షిస్తున్నారు". జనవరి 26న భారత రిపబ్లిక్ ప్రకటన ఏడవ వార్షికోత్సవాన్ని విస్తృతంగా జరుపుతూ వున్నప్పుడు సోవియట్ ప్రజలలో రేకెత్తిన భావాలను, పై పంక్తులలో "ప్రవ్దా" పత్రిక తన సంపాదకీయంలో ప్రకటించింది.

మాస్కోలో ఒక ఉత్సవసభ జరిగింది, అఖిల యూనియన్ ట్రేడ్ యూనియన్ల కేంద్ర కౌన్సిల్, విదేశాలతో సాంస్కృతిక సంబంధాలు నెరపే సోవియట్ దేశ సంఘమూ యీసభను ఏర్పాటు చేశాయి.

మాస్కో ట్రేడ్ యూనియన్ భవనంలో బాగా అలంకరించబడిన హాల్ ఆఫ్ కోలమ్స్ పదిహేనువందల మందికి పైగా కార్మికులు, ఉద్యోగులు, పౌర సంస్థల ప్రతినిధులు, శాస్త్రజ్ఞులు, సంస్కృతీ సేవకులు, విద్యార్థులతో నిండిపోయింది.

సోవియట్ దేశ సాంస్కృతిక మంత్రి నికొలాయ్ మిహైలోవ్, విముక్తి పొందిన తరవాత భారత ప్రజలు ఆర్థిక వెనుకబాటుతనాన్ని ఎలా అధిగమిస్తున్నారో, సాంస్కృతిక పురోభివృద్ధికై ఎలా పాటుబడుతున్నారో తెలియజేశారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద, ప్రస్తుతంవున్న అనేక పారిశ్రామిక సంస్థలు బాగా పెద్దవి చేయబడుతాయి. కొత్తవి నిర్మించబడతాయి, నీటి వసరులతో వ్యవసాయం జరిగే ప్రాంతం యెక్కువవుతుంది, కొత్త జల విద్యుత్ కేంద్రాలు నిర్మింపబడతాయి, తదితర విధాల అభివృద్ధి సాగుతుంది. పంచవర్ష ప్రణాళికను సఫలం చేయడంలో భారత ప్రభుత్వం యితర దేశాలతో ఆర్థిక సంబంధాల అభివృద్ధికి, ముఖ్యంగా సోవియట్ దేశంతో ఆర్థిక సంబంధాల అభివృద్ధికి గొప్ప ప్రాముఖ్యాన్నిస్తూంది అన్నారాయన.

భారతదేశపు స్వతంత్ర శాంతివిధానం దానికి ప్రపంచ ప్రజల ప్రగాఢ గౌరవాన్ని సంపాదించిపెట్టింది, అన్నారు మిహైలోవ్. శాంతి కోసం భారతదేశం సాగించే కృషిని సోవియట్ ప్రజలు ఎంతో మెచ్చుకుంటున్నారు; యీ ఉదాత్తమైన పోరాటంలో సోదర భారత ప్రజలకు నూతన విజయాలు సిద్ధించాలని వారు కాంక్షిస్తున్నారంటూ ఆయన ముగించారు.

సోవియట్ దేశానికి భారత రిపబ్లిక్ రాయబారి కె. పి. యస్. మీనన్ ప్రసంగించడానికి లేవగా హర్షధ్వానాలు చేయబడ్డాయి. సభను ఏర్పాటు చేసినవారికి కృతజ్ఞత తెల్పి ఆయన, గడచిన కొద్ది ఏళ్ళలో శాంతి తిన్ననైన దారిని నడవక వంకరటింకర దారిని నడచిందని చెబుతూ, సోవియట్-భారత దేశాల మైత్రిలో ఎగుడుదిగుళ్ళు లేకపోవడం తనకు సంతోషంగా వుందన్నారు.

చాలా యితర సభలూ, ప్రదర్శనలూ, భారత దేశం గురించి ప్రత్యేక ఉపన్యాసాలూ మాస్కోలోనూ, దేశంలోని యితర ప్రాంతాలలోనూ జరిగాయి.

సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తు ప్రాచ్య విద్యాసంస్థ వైజ్ఞానిక సమితి భారత రిపబ్లిక్ సప్తమ వార్షికోత్సవాన్ని జరిపేందుకు జనవరి 25న ఒక సభను జరిపింది. ఈ సభకు భారత రాయబారి శ్రీ కె పి. యస్. మీనన్, చాలా బాండుంగ్ సమావేశ దేశాలకు చెందిన రాయబార కార్యాలయాల, లిగేషన్ల అధిపతులూ, ప్రతినిధులూ హాజరైనారు. "నేటి భారత దేశం", "భారత రిపబ్లిక్ విజయాలు" "భారత సోవియట్ దేశాల ప్రజలమైత్రి" గురించి రాజకీయ, వైజ్ఞానిక పరిజ్ఞాన ప్రచారానికి సంబంధించిన ఆర్మీనియన్

(మిగత 39వ పుటలో)

మాస్కోలో జరిగిన భారత రిపబ్లిక్ దినోత్సవ సమావేశంలో ఉపన్యసిస్తోన్న సోవియట్ దేశ సాంస్కృతిక మంత్రి ఎన్. మిహైలోవ్



# మాస్కో టెలివిజన్, రేడియోలలో సోవియట్ దేశానికి భారత రిపబ్లిక్ రాయబారి శ్రీ మీనన్ ప్రసంగం

భారత ప్రజలు జనవరి 26వ తేదీన జరుపుకునే భారత రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా జనవరి 25 న సోవియట్ దేశానికి భారత రిపబ్లిక్ రాయబారి శ్రీ కె. పి. యస్. మీనన్ మాస్కో టెలివిజన్, రేడియోలలో ప్రసంగించారు.

రాయబారి యిలా అన్నారు:

"ప్రియమిత్రులార, మా జాతీయ దినోత్సవ సందర్భంలో నాలుగు మాటలు చెప్పమని నన్నడిగినందుకు మాస్కో రేడియో వారికి కృతజ్ఞుణ్ణి. గతసారి, అంటే 1956 జూన్ 23 వ తేదీన నాకు మాస్కో రేడియోలో ప్రసంగించే అవకాశం కలిగింది; ఆరోజు, ప్రధానమంత్రి బుల్గానిన్, ప్రధానమంత్రి నెహ్రూలచే మాస్కోలో విడుదలైన సంయుక్త ప్రకటనమీద సంతకాలు జరిగిన రోజు వార్షికోత్సవం. అప్పుడు, సంయుక్త ప్రకటనలో మనస్ఫూర్తిగా వెల్లడింపబడిన శాంతినిగూర్చిన ఆశలనూ, అవి ఎంతవరకూ నెరవేరేయో అనే విషయాన్నీ జ్ఞప్తికి తెచ్చుకున్నాను.

"సంయుక్త ప్రకటన వెలువడిన తరవాత గడచిన పన్నెండు మాసాలలోనూ అంతర్జాతీయ ఉద్రిక్తతలో స్పష్టంగా తగ్గుదల కనిపించింది. శ్రీ బుల్గానిన్, శ్రీ కృష్చెవ్‌ల భారత దేశ యాత్ర, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20వ మహాసభ ధైర్యంగా చేసిన వాస్తవిక నిర్ణయాలు. నిరాయుధీకరణకు సోవియట్ దేశం చేసిన ప్రతిపాదన, సోవియట్ ప్రభుత్వం అమలు జరిపిన అస్త్రశస్త్రాల తగ్గింపు—యివి అంతర్జాతీయ ఉద్రిక్తత తగ్గుదలకు తోడ్పడిన హంశాలలో కొన్ని. ఆ విధంగా గత జూన్‌లో నేనిక్కడనుండి ప్రసంగించినప్పుడు సుస్థిర శాంతికి అవకాశాలు చాల బాగుండేవి.

"దురదృష్ట వశాత్తూ, ఆ తరవాత గడచిన ఆరునెలల్లోనూ మానవజాతి ఆశలు నెరవేరేయని చెప్పలేము. నిజంగా కొన్ని విషయాల్లో అవి విఫలమైనాయి. ఈ ఏడాది పూర్తి కాకమునుపే ఈజిప్టు మీద దురాక్రమణ జరుగుతుందనీ, హంగరీలో విషాద ఘటన సంభవిస్తుందనీ జూన్‌లో ఎవరనుకోగలరు?

సమావేశ దృశ్యం





భారత రిపబ్లిక్ దినోత్సవ సందర్భాన మాస్కోలోని భారత రాయబారి కె.పి.యస్. మీనన్‌ను అభినందిస్తూ ఎన్.ఎ.బుల్గానిన్, ఎన్.ఎస్.కృష్చెవ్

"అయితే, ఇది అంతర్జాతీయ పరిస్థితిని సమీక్షించడానికి సమయంగాదు. ఇది భారత, సోవియట్ దేశాల మధ్య సంబంధాలను సమీక్షించడానికి తగు సమయం. అది సంతోషకరమైన పని కూడాను.

"గడచిన ఏడాది మన ఉభయదేశాల మధ్య సంబంధాలు సర్వతోముఖంగా అభివృద్ధి చెందాయి. సోవియట్ దేశం తన ఆరవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభించినట్టుగానే భారత దేశం తన ద్వితీయ పంచవర్ష ప్రణాళికను అమలు జరపడం యిప్పుడే ప్రారంభించింది. మా ద్వితీయ పంచవర్ష ప్రణాళిక మీ ప్రణాళిక అంతటి బ్రహ్మాండమైనది కాకపోయినప్పటికీ, మా ప్రథమ ప్రణాళికకంటే బాగా పెద్దది. ప్లానింగ్‌ను ప్రారంభించిన మొట్టమొదటి రాజ్యమైన మీ దేశం మా ద్వితీయ పంచవర్ష ప్రణాళికను జయప్రదం చేయడంలో మాతో సహకరిస్తుండడం, గొప్ప సంతృప్తికరమైన విషయం. మధ్య భారత్‌లో బ్రహ్మాండంగా నిర్మింపబడుతున్న భిలాయ్ ఉక్కు కర్మాగారం అర్థిక రంగంలో భారత సోవియట్ సహకారానికి చక్కని దృష్టాంతం.

రాజకీయంగా మన ఉభయ ప్రభుత్వాలకూ, నిరాయుధీకరణ, న్యూక్లియార్ ఆయుధాలనూ, అణ్వాయుధ పాటవ పరీక్షలనూ నిషేధించవలసిన అగత్యం, సైనిక కూటాల నిరర్థకత్వమూ, జాతి విద్వేషము, వలస విధానాలవల్ల కలిగే కీడువంటి ప్రధాన సమస్యలపై చాల వరకు ఏకాభిప్రాయాలున్నాయి. ఒకటి రెండు విషయాల్లో మనం ఒకరితో ఒకరు ఏకీభవించలేక పోతున్నామన్నది నిజమే. విభిన్న సాంప్రదాయాలూ, విభిన్న పరిస్థితులు గల దేశాలమధ్య యిది సహజమే, అటువంటి వ్యత్యాసాలు మన ప్రధాన మైత్రికి భంగం కలుగజేయవు. మన సాంస్కృతిక సంబంధాలు బాగా పెంపొందేయి.

(మిగత 33వ పుటలో)

# ఉత్సవ నగరం మాస్కో

1957 వేసవిలో యువజనోత్సవం జరిగేటప్పుడు మాస్కో ఎలా కనిపిస్తుంది?

ఉత్సవాలంకరణలకు బాధ్యుడైన, ప్రతిభావంతుడైన కళాకారుడు బోరిస్ క్నోబ్లోక్ యీ ప్రశ్నకు జవాబును మా విలేఖరికి చెప్పారు. ఆయన చెప్పిన దానిని యిక్కడ ప్రచురిస్తున్నాము.

మాస్కోకు యింకా 20-25 కిలోమీటర్ల దూరంగా వున్నప్పుడే మా అతిథులు జండాలనూ, ధ్వజాలనూ, ఉత్సవ వర్ణ శోభనూ చూస్తారు. రైలు రోడ్లకూ, రహదారులకూ వెంబడినే వుండే టెలిగ్రాపు స్థంభాలపైని, తీగలపైనీ అవి కనిపిస్తాయి. రంగులు పూసిన రాళ్లు రైలురోడ్ల గట్టులపైని అమర్చబడతాయి. వివిధ దేశాల యువజన ప్రతినిధులకు అనేక భాషలలో అభినందనలను తెలిపే పదాలుగా యివి అమర్చబడతాయి.

"మాస్కో పురవాసులు తమ నగరాన్ని తామే పోల్చుకోవడం కష్టమవుతుంది. వీధుల, చౌకుల ఆకారమే కాకుండా, పేర్లుకూడా మారిపోతాయి. ముఖ్య రహదారి అయిన గోర్కీవీధి "ఐదు ఖండాల అవెన్యూ" అని పిలవబడుతుంది. దానిలోని వీధులు యూరప్, ఆసియా, ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియాలలోని నగరాల వీధుల రూపాన్ని ధరిస్తాయి. గోర్కీ వీధికి ఆనుకుని వున్న మాస్కోలోని పేరుపడ్డ త్వెర్స్కోయ్ బుల్వార్ దేవతాలోకమై పోతుంది. ప్రపంచంలోని సకల ప్రజలకు చెందిన కథలలోని వీరులూ, అప్సరసలూ మొదలైనవారు వుంటారు.

"జూలై 28వ తేదే ఉదయాన మా అతిథులు, అందంగా అలంకరింపబడిన రెండువేల కార్లలో ఊరేగుతూ లుజ్నికీ ప్రాంతంలోని బ్రహ్మాండమైన క్రీడాస్థలం వేపుగా ముఖ్యపట్టణంలోని విశాలమైన సుందర వీధులగుండా వెళ్తారు. పూలదండలతో అలంకరింపబడిన ప్రథమ మెష్చన్స్కయా వీధిగుండా కార్లు వెళ్తూ, కుడివేపుకు తిరిగి సదోవాయె బుల్వార్‌మీదుగా జు చో వ్ స్క యా చౌకుకు పోతొంటే వారిమీద పూలవాన కురుస్తుంది. ఇక్కణ్నుండి మా అతిథులు కాలినడకను "ఐదు ఉత్సవాల వీధి" అని పిలువబడే పిరొగొవ్స్కయా వీధి వెంబడిని సాగిపోతారు. బుడాపెస్టు, ప్రాగ్, బెర్లిన్, బుఖారెస్టు, వార్సా నగరాలలో జరిగిన పూర్వపు యువజన విద్యార్థి ఉత్సవాలు ఐదింటినీ యిక్కడ యువతీ యువకులు స్మరిస్తారు. పిరొగొవ్స్కయా ఐదువిభాగాలుగా విభజింపబడుతుంది, పైని చెప్పబడిన ఉత్సవనగరాలవలె ఒక్కొక్క విభాగం అలంకరింపబడి వుంటుంది. విడి విడిగా వివరాలు చూపబడతాయి—జాతీయ పతాకాలు, పూర్వపు ఉత్సవాల పెద్ద ఛాయాచిత్రాలూ మొదలైనవి. సంగీతం కూడా మా అతిథులకు పూర్వపు ప్రపంచ యువజన సమావేశాలను జ్ఞాపకానికి

*భారతదేశపు సమాచార, రేడియోశాఖ మంత్రి డాక్టర్ కేస్కర్*

"ఈ భావం అద్భుతమైనదనీ, దానిని అమలు జరపాలనీ భావిస్తున్నాను."

*అఫ్ఘనిస్తాన్ ప్రధాన మంత్రి మహమ్మద్ దావూద్*

"ప్రపంచ యువజనులకు యిది అవసరమైనది, చాలా ఉపయోగకరమైనది."

*ఏథెన్స్ మేయర్ పొసనిస్ కాట్సోటస్*

"గ్రీసు యువజనులు ఈ ఉత్సవంలో చాలా చురుకుగా పాల్గొనగలరని హృదయపూర్వకంగా ఆశిస్తున్నాను."

*పెకింగ్ సంగీత నాటక షాంఘై నాటక సమాజం దర్శకుడు చౌ సింగ్-ఫాన్*

"మాస్కో ఉత్సవం తన ఉన్నతాశయాలను నెరవేర్చి, పూర్వపు ఉత్సవాలన్నిటికంటె గొప్ప విజయాలను సాధించాలని ఆశిస్తున్నాను."

*లెబనాన్ "నద్జదే" పార్టీ అధ్యక్షుడు అద్‌నన్ అల్-హకీం*

"ప్రపంచ యువజనులకు ఒకరినొకరు తెలుసుకుని, అవగాహన చేసుకునే అవకాశాన్నిచ్చే యిటువంటి ఉత్సవాలు మనకెంతో అవసరం."

*బారిస్టర్, యుగోస్లావియా ప్రజల స్కుప్‌ష్‌తినా ప్రతినిధి విదా తోమ్‌షిచ్*

"ఇటువంటి సమావేశాలు శాంతి, అవగాహనల భావంలో యువతరాన్ని పెంచి పెద్దలను చేస్తాయి."

*దియాన్ ఆద్మా, సెనెగల్ విద్యార్థి సంఘం*

"అంతర్జాతీయ ఉత్సవాలు విచక్షణకు వ్యతిరేకంగా పోరాటానికీ, సకల దేశాల యువజనుల శాశ్వతమైత్రికీ చిహ్నమయ్యాయి."

*ఛిలీ విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ మేరియో బేజా*

"యువజనుల మధ్య వ్యక్తిగత సమావేశాల గురించి మనం ఎక్కువగా కేంద్రీకరించాలి. వివిధదేశాల యువతీ యువకులకు ఒకరి అభిప్రాయాలను ఒకరు తెలుసుకోడానికీ, ఎక్కువగా వ్యక్తిగతమైన, ప్రత్యక్ష సంబంధాలను స్థాపించుకోవడానికీ అధికతరంగా అవకాశం లభించాలి.

తేస్తుంది. చివరికి యువజన ప్రతినిధివర్గాలు పెద్ద క్రీడాస్థలంలో ప్రవేశిస్తాయి. ఇక్కడ పవిత్ర విధులతో, యీ మహోత్సవ ప్రారంభానికి సూచనగా మైత్రీజ్వాల వెలిగింప బడుతుంది.

"ఎంతోమంది వృత్తి కళాకారులు, చిత్రకళా విద్యాలయాల విద్యార్థులూ, అమెచ్యూర్ కళాకారులు రానున్న ఉత్సవంకోసం మాస్కోను అలంకరిస్తున్నారు. వాళ్ళు ఎంతోమంది వుండడంవల్ల, వాళ్ళను లెక్కించడం అసాధ్యం. కాని మేము యెంతో తొందర పనిలో వున్నాము. అన్ని వీధులూ, అన్ని చౌకులూ అలంకరించాలి గదా. వివిధ హంశాల ప్రకారం మాస్కో విభజింపబడుతుంది. ప్రేమ, యువజన మైత్రి, ఉత్సవంలో పాల్గొంటోన్న ప్రపంచ సారస్వత కళా ప్రసిద్ధులు, యిత్యాది. ప్రతిరోజూ ఎన్నో అసక్తిజనకమైన, ఉల్లాస కరమైన ప్రదర్శనాలు జరుగుతాయి గాబట్టి ఉత్సవకాలంలోని ప్రతి ఒక్కరోజుకూ ఒక ప్రత్యేకమైన అలంకరణ వుంటుంది. కార్యక్రమంలో ప్రత్యేకమైన బాలికల ఉత్సవం; వలసదేశాల, ఆ వలస దేశాలపై పెత్తనంచేసే దేశాల యువజనుల సమావేశం; మైత్రీ ఉద్యానాన్ని నాటే ఒక ప్రత్యేకసమయం; నృత్యగాన ఉత్సవం; క్రీడాభవనంలోని హిమ ప్రదర్శనం; మాస్కో నదిపైని ఒక ఉల్లాసకరమైన జల క్రీడోత్సవమూ; ఒక గొప్ప యువజనుల విందు, యిటువంటివి ఎన్నో వుంటాయి.

ఈ ఆనందమయమైన ఒక హంశాన్ని మేము చూస్తున్నట్టు—ఉదాహరణకు ఆగస్టు 6న గ్రామీణ యువజనోత్సవాన్ని—ఊహించుకోండి. సోవియట్ దేశ వ్యవసాయ, పారిశ్రామిక ప్రదర్శనాల తావులో ఉదయం పూట యువతీయువకులు సమావేశమవుతారు. అక్కడవున్న మూడు పెద్ద ఆర్చిలకూ రిబ్బన్లూ, తాజా పూలతోనూ, గోధుమ కంకులతోనూ, మొక్కజొన్న, వరి, ప్రత్తి కంకులతోనూ కట్టిన దండలూ అలంకరించి వుంటాయి. ద్వారాలవద్ద ప్రకటనలను చేసేవారు ప్రాచీన రష్యాలోని సంతలలో వున్నట్టుగా వుంటారు. ప్రదర్శన భవనాల ఎదుట చౌకులలో నిజమైన బజార్లుంటాయి. రష్యన్ బజార్లో యితర ఆకర్షణలుంటాయి—రంగుల రాట్నాలూ, బ్రహ్మాండమైన ఉయ్యాళ్ళు, చక్కగా రంగులువేసిన వరుసలతోనూ, మధ్యాసియా రిపబ్లిక్కుల సంపదలతోనూ ఒక మధ్యాసియా బజారు యింకొకటి. ఎన్నోవస్తువులు ప్రాచీనకాలపు విపరీతవస్తువులనుండి, ఏచోటికైనా అందజేయబడే వీలుగల అతి నవీనమైన వ్యవసాయ యంత్రాల వరకూ యిక్కడ జరిగే లాటరీలో గెలుచుకోవచ్చును.

"ఉక్రేనియన్ ప్రదర్శనశాలలో యీ బాలబాలికలు యింత ఉల్లాసంగా గుమిగూడి వున్నా రెందువల్ల? ఒక చిన్న గోధుమ పొలం మీద పనిచేస్తోన్న ఒక చిన్న కోత యంత్రం పంటనుకోసి నూర్చింది, ఒక చిన్న మిల్లు పిండి కొట్టింది. ఒక రొట్టెల దుకాణం అక్కడే చూస్తూ నిలబడివున్న యువజనులకు వేడివేడి బజ్జీలను తినమని యిచ్చింది. ఇంకొంత దూరంలో మాల్దేవియా ద్రాక్ష రైతులు యిప్పుడిప్పుడే పెద్ద ద్రాక్షపంటను కోయడం పూర్తిచేసి ప్రేక్షకులకు కొత్త ద్రాక్షాసవాన్ని యిస్తున్నారు.

"ఒక పెద్ద గీతల బుట్టను మేము చూశాము. ఒకమూలనుండి సజీవంగావున్న ఒక పొట్టేలు దానిలోనికి తోలబడింది; యింకోవేపు నుండి ఒక జార్జియన్ యువకుడు పొగలు కక్కుతోన్న షష్లిక్‌ను మాకు యివ్వడానికి సిద్ధంగా వున్నాడు. పొట్టేలు సజీవంగా, ఆరోగ్యంగా, ఒక చివరను అరుస్తూవుంది. ఇదంతా అసక్తిజనకంగా, ఉల్లాసంగా, సుందరంగా వుంటుంది....

"కాని చూడండి! పెద్ద వింత ఆకారపు ఓడలు గాలిలోనికి లేస్తున్నాయి. అవి ఖర్బూజా పళ్ళలాగా, కారట్ దుంపల్లాగా, దోసకాయల్లాగా, మొక్కజొన్న కంకులు, ఆపిలు పళ్ళలాగా ఒక మాస్కో ఫాక్టరీలో చేసిన బెలూన్లవి. ఈ బ్రహ్మాండమైన కేంద్రంలో చీకటిపడుతుంటే వేలాది సెర్చిలైట్లు చీకటి ఆకాశంలోనికి తమ కిరణాలను ప్రసరింపజేస్తాయి; సకల దేశాల, సకల ఖండాల యువతీ యువకులు ఉల్లాసంగా నృత్యంచేస్తారు.

"మాస్కోలోని ఉత్తమమైన పార్కులలో ఒకటైన ఒస్తన్‌కినోలో ప్రదర్శింపబడే వలసదేశాల యువజనులతో సంఘీభావానికి అంకితమైన సాయంత్రం ఎంతో అందంగా వుంటుంది. ఇక్కడ ఒక పెద్ద తటాకం మధ్యలో ఒక పెద్దమంట వేయబడుతుంది; వలస, పరాధీన దేశాల యువజనులతో వారిపైని పెత్తనం చేసే దేశాల యువజనుల మైత్రి, సంఘీభావాలకు సంబంధించిన మంట అది.

"మాస్కోలోని ఉత్సవంలో ప్రతిరోజునూ, ప్రతిగంటనూ మా అతిథులు జ్ఞాపకం పెట్టుకునేటట్టుగా చేయడానికి యావచ్ఛక్తినీ ఉపయోగించి మేము కృషిచేస్తాం.

"రానున్న యువజనోత్సవాల వివరాలన్నిటినీ యీ క్షణాన పేర్కొనడం, కష్టం. కాని యిప్పటివరకూ జరిగిన ఉత్సవాలలో అత్యంత సుందరమైనదానిగా, అత్యంత ఆనందమయమైనదానిగా చేయడం మా అభిమతం. మాస్కోలో జరుగబోయే ఉత్సవం శాంతి స్నేహాల ఉత్సవంగా వుంటుందని మనకు విదితమే!



# సోవియట్ ప్రజలకు భారతీయుల కానుక



వేనవేలమంది మాస్కో పౌరులు గత ఏడాది భారత దేశపు చేతి వనుల ప్రదర్శనాన్ని చూస్తున్నప్పుడు, కేంద్ర విశ్రాంతి ఉద్యానం లోని ఒక ప్రదర్శశాలలో, ఒకరు నిట్టూర్చుతూ యిలా అనడం విన్నాను...."దీని నంతట్నీ మళ్ళీ చూడ్డానికి అవకాశం దొరకదు గదా!" అసలు విషయమేమిటంటే—ప్రదర్శనాన్ని చూడాలనుకున్న వారు ఎంతోమంది వుండడంవల్ల టికెట్టు సంపాదించడం యించుమించుగా అసాధ్యం; యింతేకాకుండా యీ ప్రదర్శనంకోసం సోవియట్ దేశంలోని యితర నగరాలలో ఎదురు చూస్తున్నారు.

సోవియట్ ప్రజలకు యీ ప్రదర్శిత వస్తువులలో ఒక భాగాన్ని బహూకరించే సందర్భంలో జరిగిన సమావేశానికి యిటీవల నేను వెళ్ళినప్పుడు, యిది నాకు జ్ఞాపకం వచ్చింది. "ఇక మాస్కో పుర వాసులు యీ అద్భుత వస్తువులను ఎప్పుడైనా చూసి ఆనందించే అవ కాశం కలుగుతుంది...."అని అనుకున్నాను.

ఈ ఉత్సవసభ ప్రాచ్య సంస్కృతీ వస్తుప్రదర్శనశాలలో మధ్యాహ్నం జరగవలసివుంది. బాగా చూడ్డామన్న ఆశతో మేము అరగంటముందరే వచ్చాము. కాని యితరులు కూడా యిదేవిధంగా భావించారని స్పష్టమైంది.

సోవియట్ దేశానికి భారత రిపబ్లిక్ రాయబారి శ్రీ కె.పి.ఎస్. మీనన్, రాయబార కార్యాలయ ప్రథమకార్యదర్శి శ్రీ వి. కె. ఆహూజా, సోవియట్ దేశ సంస్కృతీ ఉపమంత్రి శ్రీ వి.ఐ. పఖమోవ్ వస్తు ప్రదర్శన శాలకు రావడంతో ఆదరభావంతో హర్షధ్వానులు సాగాయి. శ్రీ మీనన్ మైక్రోఫోన్‌కు ముందరవున్న టేబులు వద్దకు వెళ్ళి యిలా ప్రసంగించారు:

"నేడు యీ వస్తుప్రదర్శనశాలకు వచ్చినందుకు మేము చాలా సంతోషిస్తున్నాము" అంటూ ఆయన ప్రారంభించారు. "మీ ధైర్యశాలి యైన యాత్రికుడు అఫనసి నికితిన్ రోజులనుండి రష్యా, భారత దేశాలకు ఒకదానిపట్ల యింకోదానికి ఆసక్తి వుంది.

"విదేశ పీడనక్రింద భారత దేశం వున్నంతకాలమూ మన దేశాలమధ్య స్నేహసంబంధాలు పెంపొందకుండా అరికట్టబడ్డాయి. నేడు మనం గొప్ప స్నేహితులం. మన స్నేహాన్ని ఎవ్వరూ భగ్నం చేయలేరు. సోవియట్ ప్రజలపట్ల మా స్నేహభావాలకూ, సోవియట్ కళలపట్ల గౌరవానికి చిహ్నంగా యీ కానుకను మీరు స్వీకరించ గలరని ఆశిస్తున్నాను" (రష్యన్‌నుండి మళ్ళీ యింగ్లీషులోనికి అనువ దింపబడింది).

బదులుచెపుతూ వి. ఐ. పఖమోవ్ యీ అద్భుతమైన బహు మానాన్ని యిచ్చినందుకు రాయబారికీ, భారతీయులకూ హృదయపూర్వ కంగా కృతజ్ఞతను తెలియచేశారు,

"మాస్కోలోనూ, లెనిన్‌గ్రాడ్‌లోనూ భారతీయకళారచనలు యింకా ఎక్కువగా లేవు. ఇది వాటికి అలంకార ప్రాయం గా వుంటుంది. ఈ కానుక, మన ప్రజల శ్రేయస్సుకై సాగేమన అభేద్య మైన మైత్రిక యింకొక దృష్టాంతం...."

సభముగిసిన తరవాత వస్తుప్రదర్శనశాల ఉద్యోగులు భారత దేశపు హాలును చూడడానికి రాయబారిని ఆహ్వానించారు. అక్కడి వారిలో అధికభాగం రాయబారివెంట వెళ్లారు. కానుకలను జాగ్రత్తగా పరిశీలించడానికి మేముకూడా ఈఅవకాశాన్ని ఉపయోగించుకున్నాము.

సుందర వర్ణశోభితమైన చిన్న బ్రొకేడ్ గిలేబు, శాలువలూ నా దృష్టి నాకర్షించాయి. వాటిలో అధికభాగం బనారస్‌లో తయారు

(మిగత 33వ పుటలో)





# సామాన్యుని కథ

## ఏ. వెర్బిత్‌స్కీ

(ఛాయా చిత్రాలు : జి. పెర్-అవనేశ్యన్)



కర్మాగారంలో పనిలో వున్న నికొలాయ్ కొతెల్నికోవ్

"రేపట్నుండీ నొవొజిలోవ్ మీ ఫోర్మన్‌గా వుంటాడు" అంటూ వాచి ఫ్యాక్టరీలోని షాపు సూపరెండెంటు, మెకానిక్కు నికొలాయ్ గ్రిగోరీవిచ్ కొతెల్నికోవ్‌కు చెప్పాడు. అంతేకాకుండా ఆయన "అతను నీ శిష్యుడని నాకు తెలుసు; చాలా కుర్రవాడనీ అనుకుంటావేమో. కాని అది తప్పు అభిప్రాయం. అతనిది తెలివైన బుర్ర మంచి పనివాడు"అని కూడా అన్నాడు.

"మంచిది, నా తరఫున మీరు అతనిని అభినందించవచ్చు. చాలామంది ఫోర్మెన్లను చూశాము; యింకా చాలా మందిని చూస్తాం కూడానూ"అని కొతెల్నికోవ్ బదులు చెప్పాడు.

"అతనితో నువ్వు బాగా గడుపుకు పోగలవని నా విశ్వాసం వెళ్ళివస్తాను."

అవును, తాను ఫాక్టరీని వదలి వెళ్ళిపోవాలన్నది స్పష్టం తనలాంటి పాతకాపు, యించుమించు నలభై ఏళ్ళ పని అనుభవమున్నవాడు, ఒక కుర్రకుంకనుండి, పన్నెండేళ్ళక్రితం తాను ఫిట్టర్ పనిని నేర్పినవానివద్దనుండి హుకుంలు పుచ్చుకోవలసి వస్తుందని ఎవ్వరూ అనుకోరు. నొవొజిలోవ్ కుర్రవాడూ, తన పూర్వపు శిష్యుడూ అని మాత్రమేకాదు, వాడికి తన శక్తిలో తనకి విపరీతమైన విశ్వాసం, మొండితనమూ; తన క్రిందనున్న పెద్ద కార్మికుల పట్ల అట్టే గౌరవం లేదు. వదలి వెళ్ళిపోవడమే మంచిది.

తాను ఎన్నోఏళ్ళ పనిచేసిన ఫాక్టరీనుండి వెళ్ళిపోవడం అతనికి. యిష్టంలేదు. కాని వెళ్ళక తప్పదని తేలిపోయింది.

ఆ సాయంత్రం నికొలాయ్ గ్రిగోరీవిచ్ తనభార్యకు చెప్పాడు

"ఫాక్టరీని వదిలి పెట్టడమా?"అని ఆశ్చర్యంగా అందామె, చేతులు ఊపుతూ. "ఆపని చెయ్యవద్దు. తప్పని సరయితే, యింకో డిపార్టుమెంటుకు బదిలీచెయ్యమని డైరెక్టరును అడగండి."

భార్య ఫాక్టరీ పనిని వదిలి పెట్టవద్దనడానికి కారణం నికొలాయ్ గ్రిగోరీవిచ్‌కు తెలుసు. దానికి గట్టికారణం వుంది. కొన్ని ఏళ్లగా తోడి కార్మికులు చక్కని కొత్త భవనాలలోని పెద్దయిళ్ళకు మారారు. వీటిని ఫాక్టరీ, ముఖ్యంగా ఉత్తములైన కార్మికులకోసమూ, వృద్ధ కార్మికులకోసమూ నిర్మించింది. ఈ కొత్త యిళ్ళలో అద్దెకూడా కొద్ది; వేతనంలో నూటికి 5 నుండి 8 వంతులకు మించి వుండదు. అటువంటి యింట్లోకి మారడమంటే ఎవరికైనా సరే గొప్ప అదృష్టం; అసహ్యమైన కొంపలకు విప్లవానికి ముందర యించుమించు జీతంలో ఒకటింట మూడవవంతు చెల్లించవలసివచ్చిన వృద్ధ కార్మికులకు ప్రత్యేకంగా.

"మీకు రాబోతోన్న కొత్తయింటిని పోగొట్టుకోనివ్వను. మీరు కష్టించి సంపాదించుకున్నదది! మీరు యిష్టపడినట్టయితే నేనే డైరక్టరు దగ్గరకెళ్ళి, మిమ్మల్ని బదిలీ చెయ్యమని అడుగుతాను."

కొతెల్నికోవ్ తోడి కార్మికులు చాలామంది కొన్నేళ్లుగా గృహప్రవేశ ఉత్సవాలు చేసుకోవడం నిజమే. కాని కొత్త పని పద్ధతులను ప్రవేశపెట్టి, ఫాక్టరీ అంతటా గౌరవాన్ని చూరగొన్న మెకానిక్కు అయిన తాను, 20 ఏళ్ళక్రితం ప్రవేశించిన రెండుగదుల యింట్లోనే యింకా నివసిస్తున్నాడు. ఒక పాతకర్ర కట్టడంలో వుండేది, తన యిల్లు. అది పొడుగా, చాలా సదుపాయాలు లేకుండా వుండేది. ఇదేకాకుండా, ఒక రిస్టారెంట్‌లో కేషియరుగా పనిచేస్తోన్న తగువులమారి పొరుగువానితోబాటు ఒకే వంటయింట్లో వంటచేసుకోవలసి వచ్చేది.

"మీస్నేహితులు ఎలా జీవిస్తున్నారో కాస్తచూడండి!" అందాయన భార్య. "సిరోవ్నివ్ కుటుంబానికి పెళ్ళనయా వీధిలో ఒకపెద్ద యిల్లుంది. మాస్లోవ్‌స్కీ కుటుంబం తమ కొత్త యింట్లో ఎన్నాళ్ళనుండో వుంటున్నారు, సొకొలోవ్ కుటుంబం కూడా అంతే. ఫాక్టరీ నిర్మించిన రెండో గృహంలోనికి అంతా మారుతున్నారు, కాని మీ విషయం ఎవరూ చూడడంలేదు."

ఆమె అన్నది నిజమే. అధునాతనమైన కొత్తయింటి కోసం అతను కన్నకలలు నిజమవ్వబోతోంటే, ఫాక్టరీని వదిలిపెట్టి పోవాలని అతను ఆలోచిస్తున్నాడు! ఇది నిజంగా తెలివితక్కువ తనం. కళాశాలలో విద్యను పొందిన యీడువచ్చిన కుమార్తె అతనికి వుంది. ఆమెకోసం ఎప్పుడూ అతిథులువస్తూవుంటారు, వాళ్ళను కూచోపెట్టడానికి ఉచితమైన స్థలం లేదు. ఇంతేకాకుండా యింట్లోకి ప్రవేశించే మార్గంలో చీకటిగా వుంటుంది, మెట్లు కదిలిపోతూ వున్నాయి. డైరెక్టరు వద్దకు తానేవెళ్ళి, బదిలీ చెయ్యమని అడిగితేనో ? లేదు, ఒకరిని తనకు సాయపడమని అడగదల్చుకోలేదు,

మర్నాడు ఆదివారం, సోమవారం వరకూ యిదంతా మర్చి పోయి, కులాసాగా వుందామని కొతెల్నికోవ్ నిర్ణయించుకున్నాడు, "ఇది తరవాత ఆలోచిస్తాను, దీన్నిగురించి వాలెంతిన్ ఉద్దేశమేమిటో అడుగుతాను. ఈరోగా ఆలోచించను."

ఆదివారాలు నికొలాయ్ గ్రిగొరీవిచ్ తరచుగా తన మనమలు సెరేజానూ, గెనానూ ఊరిబయిటికి షికారు తీసుకవెళ్తాడు, వేసవిలో నదిలో యీతకు వెళ్ళేవారు, లేదా గాలిపటాలు ఎగరవేసేవారు; చలి కాలంలో స్కీయింగ్ చేసేవారు. ఆదివారపు విందు అరగించడానికి వాళ్ళు తిరిగి యింటికివచ్చేవారు. యావత్తు కుటుంబమూ సమావేశ మయ్యేది—వృద్ధదంపతులూ, తమ కుమారుడు వాలెంతిన్, అతని భార్య వీరా, వారికొడుకులు, తమకుమార్తె లిదా. నికొలాయ్ గ్రిగొరీ విచ్‌కు యీ ఆదివారాల విందులన్నా, ఉత్సవదినాల విందులన్నా ఎంతో యిష్టం.

ఈ ఆదివారంనాడుకూడా భోజన సమయానికి యావత్తు కుటుం బమూ వుంది. మూడుగంటలప్పుడు వడ్డన జరిగింది. నికొలాయ్ గ్రిగొరీవిచ్ అనుకున్నట్టుగా అతనిభార్య,జిల్లా గ్రంధాలయాధికారిణియైన కుమార్తె కొత్తయిళ్ళ గురించిగాని పనిని వదిలిపెట్టడం గురించిగాని. ఖర్చులు గురించిగాని ఆ గృహస్తునికి చీకాకు కలిగించే ఏ విషయం గురించి గాని ప్రస్తావించలేదు. భోజనం ముగిసిన తరవాత చాలా సేపటివరకూ వారు భోజనాల బల్లవద్ద కూర్చుండి వుండిపోయారు.

చివరికి నగరంలోని సినీమాకు వెళ్ళడానికి వాళ్ళు నిర్ణయించు కున్నారు.

స్త్రీలు, పిల్లలూ ముందుగా నడిచారు. పురుషులు వెనుక నున్నారు. నికొలాయ్ గ్రిగొరీవిచ్ కొడుకు తండ్రి కొక వార్తచెప్పాడు. ఈ విషయ మింకా అతను తన భార్యకుకూడా చెప్పలేదు. కజకస్తాన్లోని ఒక కొత్త ప్రభుత్వక్షేత్రంలో అతనికి ఉద్యోగానికి రమ్మని ఆహ్వానం వచ్చింది. అక్కడ బీళ్లు సాగుక్రిందికి తీసుకరాబడుతున్నాయి. పెద్ద జీతం యిస్తారు, కాని తన భార్య ఏమంటుందోనని అతను బాధ పడు తున్నాడు. తండ్రి సలహా అడిగాడు.

ఇద్దరు చిన్నపిల్లలను కొత్త ప్రాంతానికి తీసుకవెళ్ళడం కష్ట మైన పనని నికొలాయ్ గ్రిగొరీవిచ్ అన్నాడు. కాని వాలెంతిన్ యిది బాగా ఆలోచించాలి. ప్రతి ఒక్క విషయమూ మంచిచెడ్డ లాలోచిం చాలి. అప్పటికప్పుడు సలహా యివ్వడం అసాధ్యం. దీనిగురించి తన కుమారుని ఉద్దేశం ఏమిటి? ఈ పని అతనికి యిష్టమేనా? డబ్బు సంగతిపెరు, అది ముఖ్యవిషయం కాదు అన్నిటికంటె ముఖ్యవిషయ మేమిటంటే, పని అతనికి సంతృప్తికరంగా వుంటుందా? సమాజానికి తను ఉపయోగ పడతాడా?

ఈ సందర్భంలో నికొలాయ్ గ్రిగొరీవిచ్, నొవొజిలోవ్‌ను ఫోర్మన్‌గా నియమించడం గురించి, తాను ఫ్యాక్టరీనుండి వెళ్ళిపోదా మని అనుకుంటూ వుండడం గురించి కొడుకుకు చెప్పాడు.

"ఫ్యాక్టరీని వదిలి వెళ్ళడమా?" అంటూ అతని కొడుకు ఆశ్చర్యపడ్డాడు. "ఇది తొందరపాటుగా చేసిన నిర్ణయంలాగా వుంది. ఆ కుర్రకుంకక్రింద పని చేయడం బాగా వుండదు, నిజమే. అతని మూలంగా మీ యావత్తూ జీవితాన్ని మార్చి వేసుకోకూడదు"

కొత్త ఫోర్మన్‌తో మనసువిప్పి మాటాడమనీ,అతను మొరటుగా ప్రవర్తించినా, చీటికీ మాటికీ తప్పులు వెతకడం సాగించినా తాను ఫ్యాక్టరీ డైరెక్టరుకుగాని, ఫ్యాక్టరీ కార్మిక సంఘాధ్యక్షునికిగాని ఫిర్యాదు చెయ్యగలనని అతనిని హెచ్చరించవలసిందనీ అతను తండ్రికి సలహా యిచ్చాడు. ఇందువల్ల ప్రయోజనం లేకపోయినప్పుడు, నొవొజిలోవ్ కసరడం సాగించినప్పుడు మాత్రమే ఆయన పనిని వదిలిపెట్టవలసిం దని కొడుకు సలహా యిచ్చాడు.

"అవును, నువ్వన్నది నిజమే" అన్నాడు నికొలాయ్ గ్రిగొరీ విచ్. అలాగే చేదామన్నాడు.

ఆవేళ ఏం జరిగిందంటే సినిమా వసారాలో నొవొజిలోవ్ కని పించాడు మొదట అతన్ని చూడనట్టు నటిద్దామా, లేదా పలకరిద్దామా అని నికొలాయ్ గ్రిగొరీవిచ్ అనుకున్నాడు. కాని నొవొజిలోవ్ తానే తన పూర్వపు గురువువద్దకు వచ్చి, కరచాలనం చేసి యిలా అన్నాడు:

"మిమ్మల్ని చూద్దామనుకుంటున్నాను. నాకు ఫోర్మన్ పని యిస్తామన్నప్పుడు, కొతెల్నికోవ్‌ను సహాయకునిగా యిస్తేనే తప్ప అంగీకరించనని చెప్పాను. ఆయన లేక పోతే పని చెయ్యలేనని చెప్పాను. మీరు దయచేసి నిరాకరించవద్దు, ఫ్యాక్టరీలో యెక్కువగా నేను గౌరవించేది మిమ్మల్నే. వాళ్ళునన్ను డైరెక్టరు చేసినా, మిమ్మల్నే నేను గురువుగా భావిస్తాను."

"నువ్వు చెపుతూ వున్నది నిజమే?" అంటూ కొతెల్నికోవ్ అడిగాడు. తరవాత "నువ్వు అప్పుడు అవమానించేవే నన్ను, దాని సంగతేమిటి?" అని అడిగాడు



తన్ను ఎంతో బాధపెట్టి, ఆదివారపు సెలవురోజును కులాసాగా గడుపుకోకుండా చేసిన ఘటనను జ్ఞాపకం తెచ్చాడు. అదొక శనివారం నాడు జరిగింది. అప్పుడు అందరూ పని పూర్తి చేసుకుని యింటికి వెళ్ళిపోవడానికి తొందర పడుతున్నారు. షిఫ్టు ముగియడానికి అరగంట ముందర, తాత్కాలిక ఫోర్మన్‌గా పనిచేస్తోన్న నొవాజిలోవ్ హఠాత్తుగా మెకానిక్కుతో యిలా అన్నాడు: "ఈవేళ మీరు ఓవర్‌టైం పని చెయ్యాలి. కొన్ని పనిముట్లు సోమవారం ఉదయానికి అమర్చవలసి వుంది."

సోమవారం ఉదయం పెందరాళే యీ పనిని చెయ్యవచ్చునని అతనికి నచ్చచెప్ప బోయేడు కొతెల్నికోవ్. కాని ఆ కుర్ర ఫోర్మన్ పట్టు వదలలేదు. కొతెల్నికోవ్ వుండిపోయి పనిచేసి వేళాడు. కాని ఆ పనిముట్లు మంగళవారం వరకూ అవసరపడవని సోమవారంనాడు తెలిసింది. అన్నిటికంటె బాధించినదేమంటే—నొవాజిలోవ్ తన పూర్వపు గురువుకు క్షమాపణ చెప్పడం అవసరమని భావించలేదు.

"ఇటువంటి అవమానాలు మీకు బాగా జ్ఞాపకం వుండిపోతాయే!" అంటూ నొవాజిలోవ్ అన్నాడు నవ్వుతూ. "కాని యిటువంటిది మళ్ళీ ఎన్నడూ జరగదని మీకు మాట యిస్తున్నాను."



శనివారపు సాయంత్రాన స్వగృహంలో (ఎడమనుండి కుడికి) ఎన్. కొతెల్నికోవ్, ఆయన సతీమణి ఎగ్రెప్పినా, మనమడు సెర్యోషా, కుమార్తె లిదియా

మర్నాడు నొవాజిలోవ్ ఫోర్మన్‌గానూ, కొతెల్నికోవ్ ఆయన సహాయకునిగానూ నియమింపబడ్డారని షాపులో ప్రకటింపబడింది.

ఈ పత్రిక విలేఖరిగా నేను వెళ్ళినప్పుడు నికొలాయ్ గ్రిగొరీవిచ్ తానే నాకీ కథను చెప్పారు. మెల్లగా, మొహమాటంతో మాటాడుతూ ఆయన తన పనిని గురించి, కుటుంబం గురించి చెప్పారు. తన వినోదాల గురించి, ఆయన మాటల్లో చెప్పాలంటే తన "లోపాల" గురించి కూడా చెప్పాడు. అందులో ఒకటి ఆయన విశ్రాంతి సమయంలో చాలా భాగాన్ని ఆక్రమించుకుంటుంది. ఆయన అమెచ్యూర్ నటుడు, అనేకసంవత్సరాలుగా ఫ్యాక్టరీ అమెచ్యూర్ ప్రదర్శన సమాజ సభ్యుడు.

అతని రెండో వినోదం యిందుకు బాగా భిన్నమైనది. అది గడియారాల చరిత్ర సేకరణ. "ఎండలో నీడద్వారా కాలాన్ని తెలుసుకునే గడియారాలూ, యిసుక గడియారాల నుండి నేటి కాలపు గడియారాల క్లిష్టమైన యంత్రజాలంవరకూ పయనించడం చాలా కుతూహల కరమైన పరిశీలన" అన్నాడాయన. ఆయన యీ విషయాల గురించి ఎంతో చదువుతాడు; వింతవింత నిర్మాణంతో వున్న ఎన్నో పాత గడియారాలు ఆయనదగ్గర వున్నాయి.

మెకానిక్స్, గడియారాల చరిత్ర గురించే కాకుండా నికొలాయ్ గ్రిగొరీవిచ్ సాధారణంగా చాలా చదువుతాడు. గ్రంథాలయోద్యోగిని కావడంవల్ల ఆయన కుమార్తె సరికొత్త నవలా సారస్వతాన్ని ఆయనకు యిస్తుంటుంది.

కొతెల్నికోవ్ యింటికివెళ్ళి కొత్త ఫోర్మన్ వ్యవహారం ఎలా వుందో కనుక్కుందా మనుకున్నాను. కాని నికొలాయ్ గ్రిగొరీవిచ్ అర్బాత్ చౌకులో, ఆయన యింటికి సమీపంలోనే కనిపించాడు.

"పెద్దవిశేషం:"అంటూ ఆయన కేకేశాడు. "గడియారంలోని భాగాలకు కన్నంపెట్టడానికి నేను కనిపెట్టిన యంత్రం చివరికి ఆమోదింపబడింది!"

నే నాయనను అభినందించాను. ఆయన రాబోయే యింటి వ్యవహార మేమయిందని అడిగాను.

"బాగుంది!" అన్నాడాయన. "తొందర్లోనే గృహప్రవేశం ఉత్సవానికి మిమ్మలను ఆహ్వానిస్తాను."

"నిజంగా?"

"అవును, నిజంగానే. జరిగిందేమిటంటే మా ఆవిడ నాకుచెప్పకుండా డైరెక్టరు వద్దకు వెళ్ళింది. వెళ్ళి కొత్త గృహంలో మాకు యిల్లు యిస్తానని ఆయన చేసిన వాగ్దానాన్ని జ్ఞాపకం తెచ్చింది. "ఇప్పుడు కట్టుతోన్న కొత్తయింట్లో యిళ్లు యివ్వబడేవారి జాబితాలో మిమ్మల్ని వేశాము. తొందర్లోనే మీరు గృహప్రవేశం చేస్తారు" అన్నాడాయన చిరునవ్వుతూ.

ఆయన తొందరపడుతూ ఎవేవో పొట్లాలు చేతుల్లో వుండడంవల్ల మేము సెలవు తీసుకున్నాం. నేను బయలుదేరుతూ వుండగా ఆయన అడిగాడు:

"నా గురించి, నా వ్యవహారాలగురించి యింత ఆసక్తి తీసుకుంటున్నారెందుకు? నేను ప్రముఖుణ్ణికానే. నావంటివాళ్ళు లక్షలూ, కోట్లూ వున్నారు."

"అందువల్లనే నా ఆసక్తి"అన్నాను. "సామాన్యుని గురించి, మన జీవితాన్ని నిర్మిస్తూ మన సమాజానికి గర్వకారణమైన ఒకరి గురించి నాకు సమాచారం కావాలి."



# యుద్ధ నౌకల విడుదల

లియొనిద్ కొరొబొవ్

(ఛాయాచిత్ర గ్రాహకుడు : ఐ. అకులెన్కో)

*సోవియట్ నౌకాదళానికి చెందిన మూడువందల డెబ్భయ్యైదు యుద్ధనౌకలను, వాటి సిబ్బందిని పనినుండి విడుదల చేయడంవల్లనూ, క్రోన్స్తదత్ దుర్గంనుండి జనాన్ని తరలించడంవల్లనూ, పనినుండి తొలగింప బడ్డాయి.*

ఆకాశం నీటిని తాకుతోన్నచోటినుండి వస్తోన్న శీతల తరంగాలు కక్కే నురుగులు, బాల్టిక్ సముద్రానికి ముసుగు కప్పివున్నాయి. నౌకా స్థావరమైన క్రోన్స్తదత్‌లో వీధులు నిర్మానుష్యంగావున్నాయి. సముద్రం మీదుగా వచ్చే దండయాత్రలనుండి అప్పటి రష్యా రాజధానీ నగరమైన సెయింట్ పీటర్స్ బర్గ్‌ను రక్షించడానికి రెండున్నర శతాబ్దాలకు ముందర యీ నగరం నిర్మింపబడింది.

క్రోన్స్తదత్ వారధిపైని తమ అధికారులనుండి సెలవు తీసుకుంటోన్న చాలామంది నావికులను నేను చూశాను. వారు లెనిన్‌గ్రాడ్‌కు బయలుదేరుతున్నారు.

"నౌకా సేననుండి విడుదల (డిమోబలైజేషన్) చేయబడనున్నారా, వీరు ?" అని నాకు పరిచయస్థుడైన నౌకాధికారి పావెల్ కదింత్సెవ్‌ను నేను అడిగాను.

"అవును వారు విడుదల చేయబడుతున్నారు, కాని కార్యక్రమాన్ని అనుసరించికాదు"అని చెప్పి, తనకు చెందినదళం నౌకలపైని జరిగిన సంఘటనలగురించి చెప్పసాగాడు.

సోవియట్ దేశపు సాయుధ సేనలనుండి 1955 నుండి 1957 మే ఒకటో తేదీవరకూ సుమారు యిరవై లక్షల మందిని తగ్గించాలి; నౌకాదళంనుండి 375 నౌకలు రిజర్వులోనికి వెళ్తాయి, వాటి నావికులు విడుదల చేయబడుతారు.

"అందువల్లనే మా బృందం నిర్ణీతకాలానికి ముందుగానే విడుదల చేయబడింది" అంటూ కదింత్సెవ్ వివరించాడు. "పూర్తిగా సిబ్బందిలేకుండా వున్న నౌకలున్నాయి. అందువల్ల అవి రిజర్వుకు వెళ్తాయి."

కదింత్సెవ్, నేనూ పట్టణాన్ని దాటి షిప్‌యార్డులను సమీపించాము. డ్రై డాకు లన్నిటి నిండా సరుకుల నౌకలూ, ప్రయాణీకుల నౌకలూ వున్నాయి. అన్నివేపులా మాకు వెల్డింగ్ చేస్తున్నప్పటి వెల్తురు కనిపించింది, రివెటింగ్ చప్పుడు వినిపించింది. పెద్దక్రేన్లు బరువైన ఇన్‌స్టలేషన్లను డాకులనుండి తీసుకవెళ్తున్నాయి. మరమ్మ

అవశేషాలలో చేర్చబడనున్న యుద్ధ నౌక

త్తులోవున్న నౌకలమీద ఉచితమైన స్థలంలో వాటిని దింపుతున్నాయి.

"మన శాంతి పోలీసుకు యింకో సూచన వుంది" అన్నాడు కదింత్సెవ్ నౌకలవేపు చూపుతూ. "డాకులలో సరకుల నౌకలూ, ప్రయాణీకుల నౌకలూ మాత్రమే ఉన్నాయి— ఒక్క యుద్ధ నౌకకూడా లేదు."

షిప్‌యార్డులలో షికారీచేస్తూ మేము ఒక మారుమూల వారధివద్దకు వచ్చాము. ఇక్కణ్నుంచి లోపలిమార్గంలో లంగరు వేయబడి వున్న అంబులాగా తిన్నగా వున్న యుద్ధనౌకల బారును మేము చూశాము.

అందులో కొన్ని మాకు చేరువలోనే వున్నాయి; వాటి తుపాకులు మూయబడి వున్నాయి. డెక్కులపైని సాధారణంగావుండే మల్టిపుల్ మెషీన్‌గన్ ఇన్‌స్టలేషన్సు తొలగింపబడ్డాయి. చివరి బేటర్ డౌన్, స్ట్రిప్పింగ్ పూర్తి అయిన వాతావరణం డెక్కులమీద కనిపిస్తోంది. ఒక్క పిట్టమనిషికూడా కనిపించడం లేదు. వారధికూడా నిర్మానుష్యంగా వుంది. లెనిన్‌గ్రాడ్ వేపుకు ఒంటరిగా బయలుదేరుతోన్న కావలినౌకతప్ప యింకేదీ కనిపించలేదు. అఖాతం మూల సమాధిస్థలం లాగా నిశ్శబ్దంగా వుంది. కాని నేను యీ విధంగా అంటే కందిత్సెవ్ తప్పుపట్టాడు.

నావికుని దుస్తులు పెట్టెలో పదిలపరచ బడుతున్నాయి. నావికుడు ఏ పనిలోవున్నా, పల్లెలోవున్నా అవి నావికుని నౌకా జీవితాన్ని జ్ఞాపకం చేస్తాయి





పదిలపర్చబడిన ఈ నౌకలను ఒక్కడె కాపలా కాస్తున్నారు



నౌకా దళానికి ప్రియమైన ఈ కుక్క, ఝూలిక్ తన యజమాని వి. షెపెలేవ్ వెంబడేవుంటుంది

"ఇది ఓడలకు సమాధికాదు" అన్నాడాయన. "ఇవి నిజమైన, బలమైన ఓడలు" నిశ్చలమైన ఓడలయొక్క నిశ్చలంగా నిలిచి వున్న స్థంభాలపైని ఏకాకిగా ఒక సీటికాకి ఎగురుతూ వుండడం చూస్తూవుండి పోయాడాయన కాస్సేపు. "ముందుటదళంనుండి విడుదల చేయబడిన నావికులు, తీరంపైని వారివారి పనులలో అంతా స్థిరపడి పోయారు. లెనిన్ గ్రాడ్‌లోని మాస్కో అవెన్యూ నిర్మాణంలో వారిలో చాలామంది పనిచేస్తున్నారు. బాల్టిక్ మత్స్య స్థావరంనుండి, ఉత్తరాది బొగ్గుగని స్థావరనుంచి మాకు ఉత్తరాలు వస్తున్నాయి కూడా. వారిలో చాలమంది గని పనివారవదామనుకుంటున్నారు, తాము నెలకు ఏనాలుగువేల రూబుళ్లో సంపాదిస్తున్నామని ఉత్తరాల్లో వ్రాసేరు. నావికుడు ఎప్పుడూ జీవితాన్ని బాగా నెట్టుకపోతాడు!" అని చెప్పాడాయన.

"కాని అందరూ విడుదలయినట్టు కనిపించడంలేదే, దళాలలో కొంతభాగం మిగిలిపోయిందే."

"అవును! చిన్నభాగం వుండవలసివుంది. శీతకాలంలో నౌకలమీదినుండి మంచును తొలగించాలి, ఆ పనికి ఎవరో ఒకరు వుండవలసివుందికదా, అవునంటారా?" అని గద్దించాడు కదిన్‌త్సెవ్. "ఒక నిమషం క్రితం ఏదో సమాధి అన్నారు కదా? అవును ఒకటుంది. నౌకాదళానికి చెందిన ఓడల సమాధి ఒకటి. అదిగో, అది అక్కడుంది." ఇంకా ముందరనున్న యింకొ అఖాతం తీరం వేపు ఆయన చూపాడు.

నేను అటువేపు అదేపనిగా చూశాను. ఒక వింత దృశ్యం కనిపించింది. ఏదో ఒక వింతసముద్ర నౌక స్థూలభాగం లోపలినుండి విద్యుద్దీపాల భయంకరమైన కాంతులు వస్తున్నట్టున్నాయి. దాని ఒంటరి గోట్టమూ, దానికి స్థంభాలు లేకపోవడమూ, దానిని అధునాతనమైన విమాన వాహక నౌక రూపాన్నిచ్చాయి.

చాలా పార్కులనూ, కాలువలనూ దాటి ఒకగొప్ప సాయుధ నౌకయొక్క పెద్ద ప్రక్కకు చేరాము. మా చుట్టూరా వున్న కాంతిలో, మాపైని డెక్కు ఎంత ఎత్తుగా వున్నదో నేను చెప్పలేక పోయాను. కాని చాలా న్యూమేటిక్ సుత్తెల చప్పుళ్లు, లోపలి యంత్రాల గర్జనలూ మాకు వినిపించాయి. దూదివేసి కుట్టిన జుబ్బాలు వేసుకున్న వారు యిటూఅటూ పరుగెత్తుతున్నారు, కానరాని డెక్కుపైకి ఎక్కుతూనో, వారధిపైకి దిగుతూనో.

"ఎటువంటి నౌక యిది?" అని అడిగాను, ఒక విద్యుద్దీపాన్ని పట్టుకుని వున్న ఒక కార్మికుణ్ని.

"అది నౌక కాదు. అది విడగొట్టబడుతోన్న శవం!" అన్నాడతడు.

(మిగత 31వ పుటలో)

# ప్రశ్నోత్తరాలు

## ప్రశ్న: సోవియట్ దేశంలో దొంగతనం బందిపోట్లు, దొంగ పత్రాలు (ఫోర్జరీ) మొదలైన వాటివంటి నేరాలున్నాయా?

—శ్రీ లక్ష్మణ విఠోబా బొంగిరే, షోలాపూర్.

## సోవియట్ దేశంలో యాచకులున్నారా?

—యస్. కోటయ్య, గుడ్లూరు, ఆంధ్ర; కె. యస్. పిళ్లై అండ్ సన్స్, జగ్గాల్లై; ఎ. కె. దేవగణ్ న్యూ ఢిల్లీ.

జబాబు: ఐ. వి. ఒర్లోవ్, జెర్జెన్స్కీ జిల్లా సోవియట్ సభ్యుడు, మాస్కో, కార్యనిర్వాహక సంఘ సాంఘిక భద్రతాశాఖ మానేజర్.

నేరాలకు, యాచనకూ కారణమైన సాంఘిక పరిస్థితులు సోవియట్ దేశంలో తొలగింపబడ్డాయి. ఈ దేశంలో నిరుద్యోగం లేదు, ప్రతివ్యక్తి సులభంగా ఉద్యోగాన్ని సంపాదించుకోగలడు. ప్రతి సోవియట్ పౌరునికీ వృద్ధాప్యపు ఉపకార వేతనానికి (పెన్షన్) హక్కుంది. అనారోగ్యం కలిగినప్పుడు, పనిచేసేశక్తిని కోల్పోయినప్పుడుకూడా ఉపకార వేతనాలివ్వబడతాయి. కనీస వృద్ధాప్య ఉపకార వేతనం నెలకు మూడువందల రూబుళ్ళు. సోవియట్ దేశంలో ప్రభుత్వ ఉపకారవేతనాలు వృద్ధులకూ, అశక్తులకూ మాత్రమేకాకుండా, తమ్ము పోషించేవారు లేనట్టయితే యితరుల పోషణలోవున్న దుర్బలులకు, పిల్లలకు, ఒకరి పోషణలో వున్న దుర్బలులైన బంధువులకూ, వృద్ధులైన తలిదండ్రులకూ కూడా యివ్వబడతాయి. దేశం అంతటా అనాధ బాలలకోసం బాలగృహాలు అనేకం వున్నాయి. వీటిలో పిల్లలకు ఆహార వస్త్రాలేకాకుండా విద్యకూడా యివ్వబడుతుంది. ఒంటరిగా వున్న వృద్ధులకోసం అశక్తులకోసం కూడా ప్రత్యేక గృహాలున్నాయి. వాటిలో వారిపట్ల మంచిశ్రద్ధ తీసుకోబడుతుంది.

సోవియట్ నగర వీధుల్లో చాలాకొద్దిమంది యాచకులు వుండడానికి కారణాన్ని యిదంతా విశదపర్చుతుంది. దొంగతనం, యాచన, దొంగ పత్రాలు మొదలైన వాటివంటి నేరాలు, విప్లవానికి పూర్వపు కాలంకంటె బాగా తగ్గిపోయాయి.

అయినా, కష్టభరితమైన గతంనుండి మాకు సంక్రమించిన మహామారి అయిన యాచన, నేరాలు పూర్తిగా నిర్మూలింపబడ్డాయనడము సరికాదు. సోవియట్ దేశపు యిరవై కోట్ల జనాభాలో నిజాయితీతో పని చేయడానికిష్టంలేనివారూ, పనిచెయ్యదలుచుకోని వారూ కొందరు వ్యక్తులున్నారు. అటువంటివారు అప్పుడప్పుడు నేరాలకు పూనుకుని దొంగలవుతారు; లేదా యాచన చేస్తారు. యాచకులలో చాలామంది త్రాగుబోతులు కనిపిస్తారు.

మా దేశంలో నేరాలు, యాచన అనేక విధాలుగా నిర్మూలింపబడ్డాయి. జీవిత పరిస్థితులనూ, ప్రజల సంక్షేమాన్ని అభివృద్ధి చేయడంతో బాటుగా—నేరాలను, యాచననూ తుదముట్టించడానికి యిది ముఖ్యమైనది—తప్పుత్రోవలో పడినవారికి సక్రమ మార్గాన్ని చూపేందుకు అవసరమైన చర్యలన్నీ సోవియట్ దేశంలో తీసుకొనబడ్డాయి. నేరస్థులను శిక్షించడానికీ, వారికి శిక్షణనివ్వడానికీ సోవియట్ దేశంలో న్యాయస్థానాలు నడుస్తున్నాయి. మా ప్రత్యేక పోలీసులు (మిలీషియా) స్థానిక సోవియట్ల ప్రతినిధులూ యాచకుల జీవిత పరిస్థితులను పరిశీలిస్తారు; అవసరమనుకుంటే వృద్ధ గృహాలకు వారిని పంపుతారు. చికిత్సకొరకు త్రాగుబోతులు ప్రత్యేక వైద్యశాలలకు పంపబడతారు. చాలా సందర్భాలలో యాచకులు పనిచేయగలరనీ లేదా తమ అవసరాలకు సరిపడ ఉపకార వేతనాలను పొందగలరనీ తేలింది. అవసరమయినప్పుడు పనిని సంపాదించడంలో వారికి సహాయం దొరుకుతుంది, వారి ప్రవర్తనలోని అవినీతి వారికి విశదపర్చబడుతుంది.

సోవియట్ ప్రజల సంక్షేమమూ, సామ్యవాద చైతన్యమూ పెరుగుతున్నకొద్దీ మా దేశంలో నేరాలూ, యాచన పూర్తిగా రూపుమాపబడతాయి.

## ప్రశ్న: సోవియట్ విశ్వవిద్యాలయాల్లో "వాణిజ్యం" (కామర్స్) ఏవిధంగా బోధింపబడుతుంది?

—ఆర్. కె. నారద్, జబల్‌పూర్

జబాబు: కాన్‌స్టాంతిన్ లెవిత్‌స్కీ, సోవియట్ వాణిజ్య మంత్రిత్వ శాఖ విద్యా సంస్థల సీనియర్ ఇన్‌స్పెక్టర్.

సోవియట్ దేశంలో వాణిజ్య పాఠాలు, వాణిజ్య కార్యకర్తలకు శిక్షణనిచ్చే ఉన్నత విద్యాసంస్థల్లో ప్రధానంగా బోధింపబడుతాయి. కొన్ని విశ్వవిద్యాలయాల ఆర్థిక విద్యాశాఖలు, 4-5 సంవత్సరాల శిక్షణా పద్ధతిగల ప్రత్యేక విద్యాశాలలు, యీ సంస్థలకు చెంది వుంటాయి. ఇటువంటి సంస్థలు వస్తు నిపుణులనూ (కమాడిటీ ఎక్స్‌పర్ట్స్) వాణిజ్య అర్థశాస్త్రజ్ఞులనూ, పబ్లిక్ కేటరింగ్ టెక్నాలజిస్టులను, ఎకౌంటెంట్లను ఉత్తీర్ణులను గావిస్తాయి.

ప్రవీణులైన వాణిజ్య కార్యకర్తలు, కొంతకనీసపు ప్రత్యనుభవంగల, బాగా విద్యావంతులైన వారై వుండాలి.

ఉన్నత వాణిజ్య సంస్థల విద్యా ప్రణాళికలోని హంశాలలో, యావత్తు సోవియట్ వాణిజ్యంలోని ఉత్తమోత్తములైన కార్యకర్తల అనుభవం సమీకృతమై వుంటుంది. సోవియట్ వాణిజ్య విద్యకు చెందిన ఆర్థిక శాస్త్రంలో వాడకం, ప్లానింగు వుండి తీరాలి. వస్తుశాస్త్ర విజ్ఞానం వస్తూత్పత్తి సాంకేతిక క్రమాలనూ, పదార్థాల భౌతిక, రసాయనిక లక్షణాలనూ, రవాణా అవసరాలనూ, నిలవ గురించి (స్టోరేజ్) అన్వేషిస్తుంది. సోవియట్ వాణిజ్య నిర్మాణమూ, విధా

(మిగత 31వ పుటలో)




# ఉభయత్రా లాభదాయకమైన వ్యాపారం

వి. స్పందర్యాన్
సోవియట్ విదేశ వాణిజ్య మంత్రిత్వ ఆగ్నేయాసియా శాఖాధిపతి

"విపణివీధికి రెండు వైపులా త్రోవ వుంటుంది," అని ఒక సామెత వున్నది. ఈ సామెతలోని విషయం ప్రాథమికమైన సత్యమే నైనప్పటికీ, అగ్రరాజ్యాలతో అనేక దేశాలకు వున్న వాణిజ్య సంబంధాలు చాలా వింతగా వున్నాయి: వస్తువుల రవాణా ఒక మార్గంలోనే జరగడం అందులోని ప్రధాన విషయం. దీనిమూలంగా వస్తువులను స్వీకరించే దేశాలనుండి ద్రవ్యనిధులు తరలిపోవడము, వస్తువులను ఇతర దేశాలకు పంపేదేశాలకు అలా వస్తువులను ఇతరులపై రుద్దడం కష్టతరమై పోవడమూ జరుగుతుంది. ప్రపంచంలోని అధిక సంఖ్యాక దేశాలకూ, "డాలర్ మండలం" అనబడేదానికీ మధ్యవున్న వాణిజ్యపు "బ్యాలెన్సు"ను పరిశీలించినట్లయితే ఈ విషయం బాగా వ్యక్తమవుతుంది.

నా ఉద్దేశ్యంలో సోవియట్-భారత వాణిజ్య సంబంధాలు పరస్పర లాభదాయక వ్యాపారానికి ఒక తార్కాణం. ఉభయదేశాలకూ అవసరమైనట్టి ఒకదేశంనుండి మరొక దేశానికి ఉభయత్రా సరుకులను పంపుకొనే పద్ధతిలో వున్నాయా సంబంధాలు.

సోవియట్ దేశంనుండి భారతదేశానికి సరుకులు వెళుతున్న విషయం అందరికీ తెలిసినదే. భిలాయ్ ఇనుము, ఉక్కు యంత్రాగారానికి సోవియట్ దేశపు యంత్రాలు, పరికరాలు పంపబడుతున్న విషయం చాలా మందికి తెలుసు. అది సోవియట్ దేశ సహాయంతో నిర్మింప బడుతున్నది. సోవియట్ దేశంనుండి భారత ఆర్థిక పురోభివృద్ధికి అవసరమయిన ఇనుపరేకులు, కడ్డీలు మొదలైనవీ, యంత్రాలు, పరికరాలు, పారిశ్రామిక వస్తువులు సరఫరా చేయబడుతున్న విషయం గూడా అందరికీ తెలుసు.

సోవియట్ యూనియన్—పారిశ్రామికంగా అత్యంతాభివృద్ధి పొందిన దేశం—మిత్రభారత దేశానికి తనకు కావలసిన సోవియట్ వస్తువులను కొనుక్కోడానికీ, సోవియట్ సాంకేతిక అనుభవాలను తెలుసుకోడానికీ విస్తృతమైన అవకాశాలను కల్పించింది. కాని తన వస్తువులను కొనమని సోవియట్ రష్యా భారతదేశాన్ని బలవంతం చేయడంలేదు.

"భారతదేశం తగినంతగా ఉత్పత్తి చేసుకొంటున్న వస్తువులను దానికి సోవియట్ దేశం అమ్మచలుచుకొనడంలేదు. ఎందుకంటే దాని పరిశ్రమలతోను, వ్యవసాయంతోను సోవియట్ దేశం పోటీ పడదు. పైగా దానికి భిన్నంగా మేము, భారతదేశ ఆర్థికాభివృద్ధికి సహాయపడే వస్తువులనే అమ్మజూపుతాము." అని ఎ. ఐ. మికొయాన్ ఢిల్లీలో ఉన్నప్పుడు 1956 మార్చిలో ప్రకటించారు.

సోవియట్ దేశంనుండి భారతదేశానికి జరిగే ఎగుమతుల పద్ధతి యీవిధంగా వున్నది. భారతదేశంనుండి సోవియట్ దేశానికి వస్తువుల రవాణా యేవిధంగా పెంపొందుతున్నది?

ఇంకా యీ విషయంలో జరుగవలసినంత వ్యాపారం జరుగక పోయినా, కొన్ని విజయాలు మాత్రం సాధింపబడ్డాయి.

భారత దేశంనుండి సోవియట్ దేశానికి పంపబడుతున్న వస్తువుల రకాలు అధికం కావడాన్ని మొట్టమొదటగా చెప్పుకోవాలి. ఈ మధ్యవరకు, అనగా సోవియట్-భారత వ్యాపార ఒడంబడిక జరిగేంత వరకు సోవియట్ దేశం కొద్దిమొత్తాల మసాలా వస్తువులను, లక్కను మాత్రమే కొంటూ వుండేది. కాని యీనాడు సోవియట్ విదేశాంగ వాణిజ్య సంస్థలు భారతదేశంనుండి సంప్రదాయికంగా ఎగుమతి అయ్యే వస్తువులలో అనేక వస్తువులను కొంటున్నాయి. 1956 వ సంవత్సరంలో పదిమాసాల్లో మసాలావస్తువులు, లక్కతోపాటు రెండుకోట్ల మీటర్ల జనపనార గుడ్డలనూ, ఒకకోటి 50లక్షల జన నార సంచులను, 4,000 టన్నుల తేయాకును, పదునుపెట్టని తోలుకు సంబంధించిన నలభై లక్షల చిన్నవస్తువులను సోవియట్ దేశం కొన్నది. ఈ సంవత్సరం సోవియట్ సంస్థలు భారతదేశంలో పెద్దమొత్తాలలో పొగాకు, కాఫీ, జీడిపప్పు మొదలైన వస్తువులను కొన్నాయి.

ముడిసరుకులను దిగుమతి చేసుకోవడమేగాకుండా, సోవియట్ దేశం భారత దేశం నుండి కొన్ని ఉత్పత్తి చేయబడిన వస్తువులను, ప్రత్యేకంగా ఉన్ని గుడ్డలు, పాదరక్షలను కొంటున్నది. సోవియట్ దేశంలో జరిగిన భారతీయ చేతిపనుల ప్రదర్శన గొప్ప విజయాన్ని పొందిన తర్వాత, సోవియట్ విదేశ వ్యాపార సంస్థలు, వెండి, దంతం మొదలైన వస్తువులతో తయారుచేయబడే వివిధ చేతిపని వస్తువులను కొంటున్నాయి. అందమైన కాశ్మీరు శాలువలను గూడా కొంటున్నాయి.

(మిగత 39 వ పేజీలో)

# భారత దేశంలో భారీయంత్ర నిర్మాణ కర్మాగారం

## సోవియట్ నిపుణులు శ్రీ నెహ్రూకు సమర్పించిన నివేదిక

భారత ప్రభుత్వం ఆహ్వానంపైన, సోవియట్ దేశ భారీ యంత్ర నిర్మాణశాఖ ఉపమంత్రి ఎన్. ఐ. బాబిచ్ నాయకత్వాన భారత దేశానికి వచ్చిన ఒక సోవియట్ ప్రవీణులజట్టు, భారత దేశంలోని మొట్టమొదటి భారీ యంత్రోత్పత్తి యంత్రాగారాల నిర్మాణానికి సంబంధించిన నివేదిక పనిని పూర్తి గావించింది.

1957 జనవరి 29వ తేదీన ఆ నివేదిక ప్రధాని శ్రీ జవహర్ లాల్ నెహ్రూకు, భారత ప్రభుత్వ భారీ పరిశ్రమల మంత్రాంగానికీ సమర్పింపబడ్డది.

పై నుదహరించిన యంత్రాగారాల నిర్మాణం ద్వారా భారత దేశంలో, పరిశ్రమల్లో ఒక ముఖ్య శాఖ అయిన భారీ యంత్రోత్పత్తి పరిశ్రమ సృష్టికి గట్టి పునాది యేర్పడగలదని శ్రీ బాబిచ్ టాస్ విలేఖరికి తెలియజేశారు.

ఈ యంత్రాగారాల నిర్మాణం పూర్తి అయినట్లయితే భారతదేశం ఇనుము, ఉక్కు, తదితర పరిశ్రమలకు అవసరమయ్యే భారీ యంత్రాలను, పరికరాలను తానె స్వతంత్రంగా ఉత్పత్తి చేసుకొన గలుగుతుంది. ఈ యంత్రాగారాలు క్రషింగ్, గ్రైండింగ్ మిల్లులకు, కోక్ యంత్రాగారాలకు బ్లాస్ట్ ఫర్నేసలకు, ఓపెన్ హెర్త్ ఫర్నేసలకు, రోలింగ్ మిల్లులకు, అవసరమయ్యే యంత్రాలను, ఇనుము, ఉక్కు పరిశ్రమల్లో ఉపయోగింపబడే ఇతర పరికరాలను, ఎక్స్‌వేటర్లను, మూనె పరిశ్రమకు అవసరమయ్యే భారీ డ్రిల్లింగు రిగ్గులను, గనులలో ఉపయోగపడే వైండింగు ఇంజన్లను. ఫోర్జ్, ప్రెస్ యంత్రాలను, తదితర పరికరాలను ఉత్పత్తిచేస్తాయి.

ఈ యంత్రాగారాలు సంవత్సరానికి 80,000 టన్నుల యంత్రాలను, పరికరాలను ఉత్పత్తి చేసే కెపాసిటీని కలిగి వుంటాయని అంచనా వేయబడింది.

సంవత్సరానికి పది లక్షల టన్నుల 'ద్రవ ఉక్కు'ను ఉత్పత్తిచేసే కెపాసిటీగల ఒక ఇనుము, ఉక్కు యంత్రాగారానికి అవసరమయ్యే యంత్రాలు, పరికరాలు ఈభారీ యంత్రోత్పత్తి యంత్రాగారాలలో ఒక సంవత్సరంలో తయారుకాగలవు.



ఎన్. ఐ. బాబిచ్, సోవియట్ దేశ భారీ యంత్ర నిర్మాణ శాఖ ఉపమంత్రి

బహుళార్ధదాయకము, శక్తివంతము అయిన ఈ భారీ యంత్రోత్పత్తి యంత్రాగారాలు, దేశ ఆర్థికాభివృద్ధి అవసరాల ననుసరించి, ఇతర విధాలైన భారీయంత్రాలు, పరికరాలను ఉత్పత్తి చేయడానికి ఉపయోగింపబడవచ్చును.

ప్రవీణులైన డిజైనర్లకు, సాంకేతిక నిపుణులకు, కార్మికులకు శిక్షణ నివ్వడము, వారు భారీ యంత్రోత్పత్తి పనిలో ప్రావీణ్యతను సాధించడము చాలా క్లిష్టమయిన విషయమన్న దృష్టితో, ఈ యంత్రాగారాన్ని రెండుదశలలో నిర్మించడానికి సోవియట్ ప్రవీణులు సిఫారసు చేసారు. ఈ యంత్రాగార ప్రథమభాగం సంవత్సరానికి 45,000 టన్నుల లోహ పరిశ్రమలో ఉపయోగింపబడే యంత్రాలు, పరికరాలను, గనులలో ఉపయోగింపబడే యంత్రాలు, పరికరాలను ఉత్పత్తిచేసే కెపాసిటీని కలిగి వుంటుంది.

సోవియట్ ప్రవీణుల నివేదిక, కాస్టింగ్స్, ఫోర్జింగ్స్ ఉత్పత్తి కొరకు ఒక ప్రత్యేక యంత్రాగారాన్ని నిర్మించడానికి భారత ప్రభుత్వం

(మిగత 31వ పేజీలో)

# మాస్కోలో భారతదేశపు తేయాకు

(ఫా నిలెఖరి)

స్టీమరులోని 'పెట్టెలు' నింపబడ్డాయి. ఓడ రేవంతా ప్రతిధ్వనించేటట్లు ఒక పెద్ద కూత వేసి "ఇండియన్ పైనీర్" అన్న నౌక కలకత్తా రేవునుండి సుదీర్ఘ ప్రయాణానికి—సముద్రాలు మహాసముద్రాలు దాటి వెళ్ళడానికి— బయలు దేరింది.

ఒడెస్సా రేవులో సరుకులు దించుకొన్నప్పుడు బిల్లు తనిఖీ చేయబడ్డది, ఆ సరుకుల్లో 1700 టన్నుల తేయాకు వున్నది.

అయినా, ఆ భారతీయ తేయాకు దాని పరిమళంతో సోవియట్ పౌరులను ఆనందపర్చడానికి ముందు "టీ" ప్యాకింగ్ ఫ్యాక్టరీలకు ఒడెస్సానుండి, మాస్కోతోపాటు అనేక నగరాలకు ప్రయాణం చేయవలసి వున్నది.

"ఇండియన్ పైనీర్" నౌక తీసుకవచ్చిన భారత తేయాకులో అధికభాగం మాస్కోలోని లెనిన్ 'టీ' ప్యాకింగ్ ఫ్యాక్టరీకి పంపించ బడ్డది. చక్కని రుచి, పరిమళం, రంగు తేనీటిలో వచ్చేటట్టు వివిధ రకాల తేయాకుల మిశ్రమాన్ని తయారు చేయడానికి గొప్ప ప్రావీణ్యత, అనుభవము అవసరం.

ఈ పని మాస్కో 'టీ' ప్యాకింగ్ ఫ్యాక్టరీలో, పరిశోధనాలయ అధిపతి దిమిత్రీ బ్యకోవ్ డైరెక్షన్‌లో చేయబడుతుంది. ఈ రంగంలో యితనికి సంతై సంవత్సరాల అనుభవము వున్నది. ఈ ఫ్యాక్టరీ యొక్క ప్రధాన 'టీ టెస్టర్' నికోలాయ్ గొటిచేవ్ గూడా యీ పనిలో అత్యంతంగా తోడ్పడుతాడు. ఇతనికి ఈ రంగంలో ముప్పై సంవత్సరాల అనుభవం వున్నది.

తేయాకు పెట్టెలు దేశంలో వివిధ ప్రాంతాలకు పంపబడేముందు పరిశోధనాలయంలో రుచి చూడబడుతుంది. బంగారు—గోధుమవన్నెగల చక్కని పానీయము చిన్నచిన్న తెల్లని కప్పులలో పోయబడుతుంది. దానిరంగు ముదురుగా వుండడం మూలాన పానీయం చిక్కగా కనబడుతుంది. మేము కొన్ని కప్పుల తేనీటిని త్రాగాము (వివిధ రకాల తేనీటిని మేము

(మిగత 31వ పుటలో, చిత్రాలు ప్రక్కను)







తేయాకు పెట్టెలో పెట్టే కర్మాగారపు గిడ్డంగిలోని తేయాకు పెట్టెలు (పైన)

★

స్వయంచాలక యంత్రాలు తేయాకును ధారావాహికంగా పెట్టెలు కడుతుండగా, కుశలురైన ప్యాకర్లు వాటిని క్రేట్లకు నింపుతున్నారు (కుడి)

★

తేయాకు రవాణాకుముందు, పరిశోధనాలయంలో రుచి చూడబడుతుంది (దిగువ ఎడమను)

★

మాస్కోలో ఒక దుకాణంలోని భారత తేయాకు డబ్బాలు. సోవియట్ దేశంలో భారతదేశపు తేయాకుకు మంచి చలామణీవుంది (దిగువ కుడిన)







# మృత్యువును తప్పించిన మాస్కో చికిత్స

ఎ. లెజెబ్‌నికోవ్

"నా జబ్బు నయమవుతుందని డాక్టర్లు ఎవరూ నమ్మకం చెప్పలేకపోయారు. మళ్లీ ఇప్పుడు నేను సుఖంగా ఊపిరి పీల్చ గలుగుతున్నాను. నవ్వుతూ హాయిగా కదల గలుగుతున్నాను. సోవియట్ వైద్యచికిత్స నన్ను మృత్యువనే దానినుంచి తప్పించింది," అన్నారు మద్రాసులోని అఖిల భారత తపాలాసంఘ అధ్యక్షులు శ్రీ టి. రామానుజం.

"మేము మాస్కోలో దిగేటప్పటికి నా భర్తకు యాభై సంవత్సరాలు. ఇప్పుడు అయనకు చికిత్స జరిగిన తర్వాత ముప్ఫై ఏళ్లు నిండలేదనిపిస్తున్నది," అన్నారు దక్షిణ భారత సినిమా పనివారి సంఘాధ్యక్షురాలు శ్రీమతి మధురాబాయ్ కేల్కార్ రామానుజం.

అఖిల భారత తపాలా పనివారల సంఘం అధ్యక్షుడు శ్రీ రామానుజం పదిసంవత్సరాలపాటు అతిమూత్రవ్యాధితోను, ఉబ్బసపు దగ్గుతోను తీవ్రంగా బాధపడుతూవచ్చారు. ఆయన చాలా బలహీన పడిపోవడమే గాక, వ్యాధులు నయమవుతాయన్న ఆశనుగూడా గోల్పోయారు.

అనేక యూరోపియన్ దేశాలలోని డాక్టర్లు అతనిని పరీక్ష చేశారు. కాని ఆ జబ్బులు అతనికి తలిదండ్రులనుండి సంక్రమించాయని తెలుసుకొన్నమీదట అవి నయమవుతాయని యెవ్వరూ నమ్మకం చెప్పలేకపోయారు. రామానుజం తండ్రి అతిమూత్ర వ్యాధితోను, తల్లి చిన్నవయసులోనే ఉబ్బస దగ్గుతోను చనిపోయారు.

"నా తలిదండ్రులు చచ్చిపోతూ నాకీ రెండు వ్యాధులను అప్పజెప్పి పోయారు. విధేయుడైన కుమారునిగా నేను వాటిని స్వీకరించాను" అని విచారంతో అనే వాడాయన.

"మీకు మందెవరిచ్చారో చెబుతారా?" అని నే నడిగాను.

"డాక్టర్ కుజ్మినా. యెలిజవెతా నికొలయేవ్నా కుజ్మినా."

"ఒక కొత్త చీకాకు సమస్యను యెదుర్కొనవలసి వస్తుందా అనిపించింది నాకు. ఎందువల్లనంటె, గ్రనోవిస్కీ వీధిలోని హాస్పటల్‌కు వెళ్ళినప్పుడు నాకు అందరూ ఆడ డాక్టర్లేయెదురయ్యారు. వారే నన్ను పరీక్షచేసి మందివ్వాలి. వ్యాధి లక్షణాలను ఆడ డాక్టర్లకు చెప్పుకొనే అలవాటు మా దేశంలోగాని, చివరికి యూరోపియన్ దేశాలలోగాని లేదు.

"కాని, మళ్ళీ యెలిజవెతా నికొలయేవ్నా విషయానికివద్దాము, వెయ్యికిపైగా ఇన్సులిన్ ఇంజక్షన్లు నాకు యివ్వబడ్డాయంటే మీరు నమ్ముతారా? ఎంతోకాలంగా వ్యాధిగ్రస్థుడనై వుండడం మూలాన నా శరీరంపైన ఇంజక్షన్ సూది ఆనని ప్రదేశమంటూ యేదీ మిగలలేదు. కాని హఠాత్తుగా, మొట్టమొదటిసారిగా ఒక విషయాన్ని విన్నాను.

"ఇంజక్షన్లు అవసరంలేదు, ఇన్సులిన్ అవసరం లేదు."

"అదే రోజు డాక్టరు కుజ్మినా నాకు నాలుగు తెల్లని మాత్రలను యిచ్చింది. సోవియట్ ఔషధ శాస్త్రజ్ఞులు ఈ మధ్యనే ఉబ్బస దగ్గుకు యీ మందును కనిపెట్టారు. నాకు యెంత బలహీనత యేర్పడిందంటే మందు వేసుకోడానికి మంచినీళ్ళ గ్లాసుకూడా తీసుకొన లేకపోయే వాడిని. అయినప్పటికీ, ఆ మాత్రలు పన్నెండు తిన్న తర్వాత, నాల్గవ నాడు నెమ్మదిగా లేచి కూర్చొని, బయటపడుతున్న మంచును చూచి ఆనందించగలిగాను. లేచి కూర్చోవడమే కాదు, నడవగలననికూడా అనుపించింది."

"సోవియట్ శాస్త్రజ్ఞులు తయారు చేసిన యీ ఔషధ మందు వల్లనే నయమయిందని తలుస్తున్నారా?"

"ఈ మందు నిపుణులైన వారి చేతిలో పడింది. నేను బాగు కావడం వారి మూలాన్నే నని అనుకుంటాను. మీ హాస్పటళ్ళలో అనుసరింపబడే పరీక్షా విధానం నాకు అత్యాశ్చర్యాన్ని కలిగించింది. ఉదాహరణకు మోకాలు చిప్పలో నొప్పిపుడుతుందని చెప్పుతామనుకోండి, వెంటనే ఐదు, లేక అంతకంటే యెక్కువమంది ప్రవీణులు పరీక్షచేస్తారు. లెబొరేటరీ ఉద్యోగులు పరిశోధనలు జరుపుతారు. ఎక్సురె నిపుణులు మీ గుండె ఫొటోలు తీస్తారు. హృదయ రోగ ప్రవీణులు, ఊపిరితిత్తుల రోగాలకు సంబంధించిన ప్రవీణులుకూడా తమ కార్యాలయాల్లో మీకొరకు యెదురుచూస్తుంటారు.

"ఈవిధంగా నా రెండవ వ్యాధి అయిన ఉబ్బసదగ్గుయొక్క మూలకారణం బయటపడింది.

"అతి మూత్రవ్యాధితో వచ్చినదే ఆ జబ్బుకూడాను. మీ అతిమూత్ర వ్యాధి నయమయినప్పుడు అదికూడా నయమైపోతుంది." అని మాస్కో డాక్టర్లు నాతో అన్నారు.

"ఇప్పుడు నేను రోజుకొక మాత్ర వేసుకొంటున్నాను. అంతే గాదు... స్కీయింగ్‌కూడా నేర్చుకొంటున్నాను. 1956 ఆఖరువరకు నేను బ్రతుకనని ఒక సంవత్సరం క్రితమే అన్నారు. డాక్టర్లు ఆ విధంగా నాకు మరణదండన వేసేసారు. కాని మాస్కోలో నేను రక్షింపబడ్డాను......"

శానిటోరియందగ్గర ఉద్యానవనంలో వాహ్యాళికిపోతూ రామానుజం. ఆయన సతీమణి



## అంతర్జాతీయ సమీక్ష

# వలస దేశాల జాతీయ విముక్తి ఉద్యమాలు

పదకొండేళ్ళక్రితం, 1946 ఫిబ్రవరి 21వ తేదీని భారత నౌకా శాఖ నావికులు, భారత దేశంలో బ్రిటిష్ పాలనపైని తిరుగుబాటు చేశారు. భారతీయ సేన, విమానబలాలశాఖలు నావికులతో చేరాయి. తిరుగుబాటుదారులకు, ప్రజలు ప్రదర్శనలు చేసి ఉత్సాహకరంగా తోడుపడ్డారు.

వలసపాలనా శృంఖలాలనుండి భారతదేశం విముక్తి పొందడానికి యీ సంఘటన పెద్దగా తోడ్పడింది.

వలస, పరాధీన దేశాలలోని జాతీయ విముక్తి ఉద్యమం, మన శకంలోని అత్యద్భుత విషయాలలో ఒకటి. ఇది స్థాయిలో తుఫానువంటిది, అపూర్వమైనది; సామ్రాజ్యవాద వలస వ్యవస్థను సమూలంగా పెకలించివేస్తూ తుఫానువలె యిది ప్రపంచంలో విజృంభిస్తోంది.

తమ విముక్తి కొరకు పోరాడడానికి పీడిత ప్రజలను ఉత్తేజపరిచినది, రష్యాలో జరిగిన అక్టోబరు సోషలిస్టు విప్లవం. తమ దేశంలో జాతుల పీడననూ, వలస పీడననూ నిర్మూలించి సోవియట్ ప్రజలు, సంపూర్ణమైన సమానత్వం, పరస్పర సహాయం అన్న ప్రాతిపదికపైని వివిధ ప్రజల్మధ్య కొత్త సంబంధాలకు పునాదినివేశారు.



ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం బ్రహ్మాండమైన వలస ప్రపంచం, సామూహిక విముక్తి ఉద్యమానికి ఒక శాశ్వత కేంద్ర మయ్యింది. కోటానుకోట్ల మంది వలస పాలనను రద్దు చేయాలని వాంఛించారు. చాలా దేశాలలో వలస, అర్ధ-వలస ప్రజల పోరాటం సాయుధ తిరుగుబాటు రూపాన్ని, విముక్తి యుద్ధాల రూపాన్ని ధరించింది.

వలసవిధానం ఆసియాలో పూర్తిగా అపజయాన్ని పొందింది. చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన జరిగిన ప్రజావిప్లవం అర్ధ-వలస చైనాదేశాన్ని స్వేచ్ఛా స్వాతంత్ర్యయుతమైన, మహత్తరమైన రాజ్యంగా పరివర్తనం గావించింది. యూరప్ భూభాగానికి యించుమించుగా సరిసమానమైన భూభాగం గల చైనానుండి సామ్రాజ్యవాదులను తరిమివేయడంతో, సామ్రాజ్యవాద గుత్త అధికారుల రాక్షస కార్యకలాపాల రంగం ఎంతో సంకుచితమైపోయింది. ఎన్నో ఏళ్ళు పోరాటం సాగించాక మహత్తర భారతదేశం జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించుకుని, స్వతంత్ర రాజ్య జీవనపథాన అడుగుపెట్టింది. బర్మా, ఇండొనీషియా, ఈజిప్టు, సిరియా మొదలైన తదితర పూర్వ వలస దేశాలు, పీడనా పాలనను తుదముట్టించాయి. నేడు విముక్త దేశాల జనాభా 130 కోట్ల మందికి పైబడింది.

నిర్మించడానికి శతాబ్దాలు పట్టిన వలస రాజ్యాలను తుత్తునియలు గావించి నాశనం చేయడానికి, ప్రజలకు పదేళ్ళకు కొస్త యెక్కువ కాలం పట్టింది. వలస రాజ్యాలు యింకా సుమారు 16 కోట్లమంది ప్రజలను తమ పెత్తనంక్రింద వుంచుకున్నాయి. కాని వలస విధానపు అంతిమ వినాశనం సమీపంలోనే వుంది; చారిత్రక ఘటనల యావత్తు గమనమూ దీనిని సమాయత్తం గావించింది.

ఉత్పత్తి స్థానంనుండి నదులను ఎగువకు ప్రవహింపజేయగలగడం ఎంత అసాధ్యమైన విషయమో, అంతగా వ్యతిరేకించడానికి అసాధ్యమైన విషయాలు వున్నాయి. కొల్లగొట్టడానికి సదవకాశాలతోబాటుగా, వాస్తవికతా పరిజ్ఞానాన్ని కూడా పోగొట్టుకొని, వలసరాజ్యాధిపతులు పొంగులువారే ప్రవాహంలోనికి దానిని వెనుకకు మళ్ళించేందుకు వ్యర్థంగా రాళ్లురువ్వుతున్నారు, ఈదుష్టమైన, మొండితనంతో కూడిన అలక్ష్యం, దేవుళ్ళకు ఎవరినైనా నాశనం చెయ్యాలనుకుంటే, వాణ్ని మొదట పిచ్చివాణ్ణిచేస్తారన్న పాత సామెత నిదిజ్ఞాపకం తెస్తుంది.

తమ స్వాతంత్ర్య సాధనకు ప్రజల విజయ యాత్రను ఆపడానికి సామ్రాజ్యవాద రాజ్యాలు చేసిన ప్రయత్నాలు వ్యర్థమైనవని, యిటీవలి కాలపు ఘటనలు యింకోసారిగా తెలియజేస్తున్నాయి.

బాండుంగ్ సమావేశం దేశాల స్వేచ్ఛాయుతమైన స్వయంనిర్ణయానికీ, వాటి స్వతంత్రమైన ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధికీ, శాంతికీ సంయుక్త పోరాటంలో ఆసియా, ఆఫ్రికా దేశాలను ఐక్యపర్చింది. 1956లో సుడాన్, మొరాకో, ట్యునీషియా ప్రజలకు స్వాతంత్ర్యం ప్రాప్తించింది. కాంబోడియా, లావోస్, జోర్డాన్ ప్రజలు సామ్రాజ్యవాద "రక్షకుల" చెడు ప్రభావాన్ని వదుల్చుకోవడానికి, వారికి యీ సంవత్సరంలో అవకాశం కలిగింది. ఇదేసమయంలో ఈజిప్టుపైని సాహసిక సైనిక చర్యను ప్రారంభించిన పశ్చిమ ఖండపు ఉన్మాద వలస రాజ్యాధిపత్యవర్గాలకు యిది మంచి గుణపాఠాన్ని బోధించింది.

ఆల్జీరియాలోనూ, యితర ఆఫ్రికారాజ్యాలలోనూ విముక్తి సమరం నిత్యం పెంపొందుతోంది. వలసవిధాన సత్వర నిర్మూలనకూ, సకల దేశాల శాంతియుత స్వతంత్రాభివృద్ధికీ పూనుకున్న అంతర్జాతీయ శక్తులు త్వరత్వరగా వృద్ధిచెందుతూన్నాయి, దృఢపడుతున్నాయి. సమీపప్రాచ్యపు నూనెగనులను స్వాయత్తం చేసుకోవడానికి అమెరికా నాయకులు తమ పథకానికి దేనినైతే ముసుగుగా ఉపయోగిస్తున్నారో ఆ కొత్త వలసరాజ్యాధిపత్య "సూత్రం" తీవ్ర ఖండనలో, గత కొద్ది మాసాల్లో యిది స్పష్టంగా ప్రకటితమైంది.

ప్రజలు వలస విధానాన్ని, అది ఏరూపంలో వున్నా తిరస్కరిస్తున్నారు, సామ్రాజ్యవాదులు తమనుండి తీసుకపోయిన సంపదను తిరిగి యిచ్చేవరకూ పోరాటం మానివెయ్యరు. వలసరాజ్యాధిపతుల నుద్దేశించి వారిలా అంటున్నారు:

"మా భవిష్యత్తు మీతో బాటుగా కాదు. సిగ్గుచేటైన వలసపీడనా విధానం ఎన్నడో అంతరించి వుండవలసింది. భూమి, దానిపైని ప్రయోజనకరమైన పనులు చేసేవారి సొత్తు కావలసివుంది."

# సోవియట్ దేశపు వార్తలు, వి

## చలనచిత్రంగా "డాన్ నదీ ప్రశాంత ప్రవాహం"

మిహెయిల్ షొలొఖోవ్ ప్రఖ్యాత నవల "డాన్ నదీ ప్రశాంత ప్రవాహం" ("క్వయట్ ఫ్లోస్ ది డాన్"), అనేక ముఖ్య చారిత్రిక ఘటనలకు సంబంధించినది. దాని నాలుగు సంపుటాలలోని పుటలు 1914-1917 సంవత్సరాలలో జరిగిన ప్రథమ ప్రపంచ యుద్ధాన్ని, అక్టోబరు సోషలిస్టు విప్లవాన్ని, అంతర్యుద్ధాన్ని, సోవియట్ పాలనలో తొలి సంవత్సరాలనూ చిత్రిస్తాయి.

ఈ చరిత్రాత్మక మహా కావ్యాన్ని మాస్కో గోర్కీ ఫిల్మ్ స్టుడియో చలనచిత్రంగా నిర్మించడానికి నిర్ణయించింది. ప్రఖ్యాత సోవియట్ చలన చిత్ర నిర్మాత సెర్గీ గిరాసిమోవ్, నవలాకారుడు మిహెయిల్ షొలొఖోవ్‌తో బాటుగా యీ చలనచిత్ర నిర్మాణానికి కృషి చేస్తున్నారు. ఇన్‌డోర్ షూటింగు అంతా మాస్కోలో జరిగింది. ఇప్పుడు నిర్మాతలూ, కళాకారులూ డాన్‌నదివద్ద, నవలలో చిత్రీకరింపబడిన స్థలాలలో వున్నారు. ఈ గ్రంథంలో చిత్రింపబడిన సంఘటనలలో పాల్గొన్న కోసక్ వృద్ధులు సలహాదారులుగా ఆహ్వానింపబడ్డారు.

## మాస్కో భూగర్భ రైల్వే 25వ వార్షికోత్సవం

మాస్కో భూగర్భ రైల్వే నిర్మాణం యిరవై ఐదేళ్ళ క్రితం, 1932 జనవరిలో ప్రారంభింపబడింది. మూడేళ్ళ తరవాత భూగర్భపు సొరంగాలగుండా తొలిసారిగా రైళ్లు నడిచాయి.

ఈ యిరవై యేళ్ళకు పైచిలుకు కాలంలో రాజధానీ నగరంలోని భూగర్భ రైల్వేలో సుమారు 1200 కోట్ల ప్రయాణీకులు ప్రయాణంచేశారు.

మాస్కో వీధులకు, చౌకులకు క్రిందుగా యిప్పటిసరికి సుమారు 130కిలో మీటర్ల సొరంగాలూ, 45 స్టేషన్లు నిర్మింపబడ్డాయి. ప్రతి 90 సెకండ్లకూ స్టేషన్ ప్లాట్ ఫారాల్లోనికి రైళ్లు వస్తాయి.

మాస్కో భూగర్భరైల్వే నిర్మాణం సాగుతూనే వుంది. దాని ఐదవ విభాగం యిప్పుడు నిర్మాణంలో వుంది. ఈ కొత్త లైను రాజధానీనగర మధ్య భాగాన్ని లెనిన్ కొండలపై నున్న ఉన్నతమైన విశ్వవిద్యాలయ భవనాలతోనూ, లుజ్నికీలోని నూతన క్రీడాస్థలంతోనూ సోవియట్ దేశ వ్యవసాయ, పారిశ్రామిక ప్రదర్శనాలతోనూ కలుపుతుంది.



## లిప్తలలో ఉష్ణోగ్రత కొలత

లెనిన్‌గ్రాడ్ క్రాస్నోగ్వార్దెయెత్స్ కర్మాగారం, వైద్యుల కుపకరించే విద్యుదుష్ణమాన యంత్రోత్పాదనలో శేఖరస్థాయి నందుకొన్నది. దీనివల్ల వైద్యులు కొద్ది సెకండ్లలో వ్యాధి గ్రస్తుని ఉష్ణోగ్రత కొలవవచ్చు. పెన్సిలు మొనవంటి ఉష్ణమాన గ్రాహక సూచీముఖిని, రోగి చర్మానికి అంటిస్తే చాలు. సన్నని తీగెలతో కలుపబడిన ఆ గ్రాహక సూచీముఖి కుడిదిక్కున కదిలి, ఉష్ణోగ్రతను డిగ్రీలో పదవవంతు వరకూ సరిగ్గా సూచిస్తుంది.

# ...శేషాలు



కొత్త గోపురం మీదినుంచి ప్రసారితమైన టెలివిజన్ కార్యక్రమంలో, ఎస్. యుత్కెవిచ్ దర్శకత్వం వహించిన "ఒథెల్లో" చూపబడింది. దీనిలో డెస్‌డిమోనా పాత్ర ఇరినా స్కొబ్‌త్సేవా ధరించింది



బాకూ టెలివిజన్ కేంద్రపు కొత్తగోపురం నగరాన్ని ప్రతీకిస్తున్న ఉన్నత నగాగ్రాన, 180 మీటర్ల ఎత్తుతో నిర్మితమైంది. ఇప్పుడు టెలివిజన్ కార్యక్రమాలు సుదూర ప్రదేశాలనుంచి సందర్శించవచ్చు. గోపురంతోపాటు కొత్త స్టూడియోగూడా కట్టబడింది



ఇజోర్స్కి ప్లాన్ట్. ఇది సోవియట్ దేశంలోని పురాతనమైన ఇంజినీరింగ్ పరిశ్రమ గ్రాస నేకరణ యంత్ర నిర్మాణం ప్రారంభించింది. ప్లాన్ట్‌కు చెందిన 7వ షాపులో రోజుకు యిటువంటి 30 యంత్రాలు నిర్మాణ మవుతాయి (పైన)



సోవియట్-భారత దేశాల రేవులమధ్య ప్రయాణిస్తున్న నౌకలలో "సుఖోనా" ఒకటి. ఒడెస్సా రేవులో ఈ నౌక సరుకు నింపుకుంటుండగా మా ఛాయా గ్రాహకుడు ఈ చిత్రాన్ని తీశాడు. ఈ నౌక భారత దేశానికి మోటార్లు, యంత్ర పరికరాలు, ఉక్కు మొదలైన వస్తువులతో వెళ్ళింది









అపారంగావున్న గాఢమైన ఆకుపచ్చని సముద్రంలాగా వున్న టైగాకు పైగా ఒక విమానం ఎగురుతోంది. అటవీ రక్షణ విమాన స్థావరానికి చెందిన వైమానికుడు, సైబీరియాలోని క్రాస్నోయార్స్క్ మండలపు అడవులపైని మామూలుగా జరిగే వైమాన సంచారం సాగిస్తున్నాడు. ఆయన ఏకాగ్ర చిత్తంతో దిగువకు చూశాడు. హటాత్తుగా ఆయనకు భయంకరమైన దావానలానికి చిహ్నమైన, ప్రమాదకరమైన పొగకనిపించింది. ప్రమాదసూచకంగా రేడియోద్వారా వెంటనే హెచ్చరిక పంపబడింది.

అడవులు, సోవియట్ దేశానికిగల ఒక గొప్ప జాతీయ సంపద. అవి నూరుకోట్ల హెక్టార్లకు కాస్త పైగా వ్యాపించి వున్నాయి. ఇది మొత్తం ప్రపంచపు అటవీ ప్రాంతంలో మూడింట ఒకటో భాగం. సోవియట్ దేశపు తూర్పు భాగాన వందలకొలదీ కిలోమీటర్లకు వ్యాపించివుంది, ప్రఖ్యాతమైన సైబీరియన్‌టైగా. ఇది భారత దేశపు అడవులవలె చీమలుదూరని చిట్టడవి, కాకులుదూరని కారడవి. టైగా దావానలాలు, తరుచుగా సంభవమయ్యే ప్రమాదాలుగా వుండేవి. విమాన సహాయాన్ని పొందేంతవరకూ మానవుడు వాటి విషయంలో



నిస్సహాయుడుగా వుండేవాడు. ప్రస్తుతం ఆధునాతన సాధనాలు గల చాలా వైమానికదళాలు ప్రస్తుతం అడవులలోని మంటలను ఎదుర్కొంటున్నాయి. ఇటువంటి దళాలలో ఒకదాని కృషి గురించి యీ ఛాయా చిత్రాలు తెలియజేస్తాయి.

విమానం తన గమ్యస్థలాన్ని, అంటే కారుచిచ్చు పుటిన స్థలాన్ని చేరుతోంది, విమానంలోని అగ్నిమాపకులు దిగడానికి అనువైన స్థలాన్ని కనుగొనడానికి గుండ్రంగా తిరుగుతూ. వారు దిగడానికి సిద్ధమయ్యారు, కాని అగ్నిమాపక సామగ్రిగల పేరాచూట్లు మొదట క్రిందికి దిగాయి. ఒకరి వెంబడిని ఒకరు విమానంలోనుండి దిగుతూ అగ్ని మాపకులు పారచూట్లను విప్పుకుంటున్నారు.

ఈసారి వారు జయప్రదంగా క్రిందికి దిగారు. కాని తరచుగా యీ అటవీ అగ్నిమాపకుడు చెట్లపై కొమ్మలపైని దిగవలసి వచ్చేది. ఇప్పుడతడు పే చూట్ల త్రాళ్ళను వదుల్చుకొని, ఒక్క క్షణం కూడా ‹ స్యం చెయ్యకుండా నిప్పుమీద దండయాత్రను చెయ్యవలసి వుంది. పోరాటం జయప్రదంగా సాగిపోతోంది. భయంకర హోమంగా మారబోతోన్న మంటలు యిప్పుడు శాంతించాయి.

# భారత, విదేశ విలేఖరుల ప్రశ్నలకు
# సోవియట్ దేశ మార్షల్ జి. కె. ఝుకోవ్ ప్రత్యుత్తరాలు

మార్షల్ జి. కె. జుకోవ్ ఫిబ్రవరి 9వ తేదీ సాయంత్రం హైద్రాబాదు భవనంలో యిచ్చిన విందులో చివరన భారతీయ, విదేశ పత్రికా విలేఖరులు కొన్ని ప్రశ్నలకు సమాధానమియ్యవలసిందని ఆయనను కోరేరు.

(1) ప్రశ్న : భారత సాయుధబలాలగురించి మీ అభిప్రాయమేమిటి ?

జవాబు : వాటిగురించి నాకు గొప్ప సదభిప్రాయం వుంది. భారత సాయుధ బలాలు సరియైన మార్గాన అభివృద్ధి చెందుతున్నాయనీ, అవి తమ మాతృభూమి రక్షణకు నమ్మకమైన పెట్టనికోటగా వున్నాయనీ నాకనిపిస్తూంది.

(2) ప్రశ్న : భారత సాయుధబలాలలో మీరేవైనా లోపాలను గమనించి వాటిని ఢిల్లీలోని నాయకుల దృష్టికి తెచ్చారేమో చెప్పగలరా ?

జవాబు : నేనిక్కడ భారత సాయుధసేనలను తణిఖీచేసేవాడిని కాను. నేను భారత ప్రభుత్వానికీ, భారత ప్రజలకూ అతిథిని.

(3) ప్రశ్న: కాశ్మీరు సమస్య విషయమై భద్రతా సంఘం చేసిన నిర్ణయంగురించి మీ అభిప్రాయమేమిటి ?

జవాబు : కాశ్మీరు సమస్య భారత దేశానికీ, పాకిస్తాన్‌కూ చెందిన వ్యవహారం, ఇంతకుమించి నేను చెప్పవలసినదేమీ లేదు. ఈ విషయమై సోవియట్ దేశ దృక్పథం అతి స్పష్టంగా వుంది. దానిని సోవియట్ ప్రభుత్వం యిదివరకే ప్రకటించింది, అందులో ఎలాంటి మార్పూ లేదు. భద్రతా సంఘంలో సోవియట్ దేశ ప్రతినిధి సొబోలెవ్ సోవియట్ దేశం యొక్క యీ దృక్పథం గురించి యిటీవల ప్రసంగించారు కూడా.

(4) ప్రశ్న : అణ్వాయుధాలుండడం వల్ల యుద్ధ ప్రమాదం హెచ్చుతుందా తగ్గుతుందా ? మీ అభిప్రాయమేమిటి ?

జవాబు : అణ్వాయుధాలుండడం యుద్ధంవచ్చే అవకాశాన్ని తొలగించదు, అది శాంతికి గ్యారంటీకాదు. అణ్వాయుధాలు శాంతికి హామీ అని చెప్పేవారు తమ స్వార్థలక్ష్యాలను మాత్రమే అనుసరిస్తున్నారు. ప్రజలకు శాంతి అవసరం. వారికి అణ్వాయుధం అవసరం లేదు. అణుశక్తి శాంతి ప్రయోజనాలకు వినియోగించబడాలని వారు కోరుతున్నారు. దురదృష్టవశాత్తూ కొన్ని సామ్రాజ్యవాద దేశాల పాలకవర్గాలు అణు, ఉదజని ఆయుధాల నిషేధం గురించి ఒడంబడిక జరగకుండా వివిధ సాకులు చెబుతూ ఆటంకపెడుతున్నాయి. ఈ విధానం మానవకోటికి వ్యతిరేకంగా వుండిగాబట్టి దానిని సోవియట్ ప్రజలు ఖండిస్తున్నారు.

(5) ప్రశ్న : ఐసెన్‌హోవర్ సూత్రం గురించి మీ అభిప్రాయమేమిటి ? అది శాంతికి సాధనమా, యుద్ధానికి సాధనమా ?

జవాబు : ఈ "సూత్రం" నిస్సందేహంగా యుద్ధానికి దారితీసే వాటిల్లో ఒకటి. ఐసెన్‌హోవర్ యీ "సూత్రాని"కి కర్త అవునో కాదో నాకు తెలీదుగాని అది సమీప, మధ్యప్రాచ్యంలో అమెరికా పెట్టుబడి చొచ్చుకుని పోవడానికి ఉద్దేశించబడింది. ఇది పాత వలస విధానమే. ఇది శాంతికి కాకుండా యుద్ధానికి దారితీస్తుంది. అరబ్ దేశాలు యీ విధానాన్ని త్రోసిపుచ్చుతాయనీ, ఏవిధానం తమ ప్రయోజనాలకు తోడ్పడుతుందో, ఏది తోడ్పడదో, తమకు నిజమైన మిత్రులెవరో, శత్రువులెవరో అరబ్ ప్రజలు తెలుసుకుంటారనీ మా నమ్మకం.

ప్రశ్న : (6) శ్రీ ఐసెన్‌హోవర్ మీ మిత్రులు. మీరు మీ అభిప్రాయాన్ని వారికెందుకు తెలియచేయకూడదు ?

జవాబు : ఒకనాటి సైనికుడుగా శ్రీ ఐసెన్‌హోవర్ నాకు మిత్రుడు, అయితే సైనికుడుగా ఆయనలో మిగిలివున్నదేమిటో నాకు తెలీదు.

(7) ప్రశ్న : భారత దేశపు ఆర్థికాభివృద్ధిని గురించి మీ అభిప్రాయమేమిటి ?

జవాబు : భారత దేశపు ఆర్థిక రంగం జయప్రదంగా అభివృద్ధి చెందుతూందని నా అభిప్రాయం. తమ దేశాభ్యుదయం కోసమూ, ఆర్థికాభివృద్ధి ప్రణాళికలను సఫలం చేయడంకోసమూ భారత ప్రజలు ఉత్సాహంగా కృషిచేస్తున్నారు.

---

## భారతదేశంలో భారీయంత్ర నిర్మాణ కర్మాగారం

(18వపుట తరువాయి)

తీసుకొన్న నిర్ణయాన్ని దృష్టిలోకి తీసుకొన్నది. భారీ యంత్రోత్పత్తి యంత్రాగారాల నిర్మాణానికి, ఒక్కొక్కటి 100 టన్నుల బరువుగల కాస్టింగ్, ఫోర్జింగ్ ఖండికలు, సంవత్సరం మొత్తం మీద అలాంటి లోహం 100,000 టన్నులు అవసరమన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి.

భారీ యంత్రోత్పత్తి యంత్రాగారాలు సమర్థవంతంగా పని చేయడానికీ, నిర్మాణపు ఖర్చులలో పొదుపు సాధించడానికీ, ఈ యంత్రాగారాల నిర్మాణంతోపాటే, కాస్టింగ్, ఫోర్జింగ్ యంత్రాగారాలను గూడా నిర్మించడం మంచిదని సోవియట్ ప్రవీణులు సిఫారసు చేసారు.

ఈ యంత్రాగారాలలో 10,000 మందికి ఉద్యోగాలు లభించగలవని అంచనాలు తెలియజేస్తున్నాయి.

అనుభవాన్ని పొంది, నిర్మింపబడిన యంత్రాగారాల్లో ప్రావీణ్యతను గడించిన తర్వాత ఈ యంత్రాగారాలను ఇంకా పెంపొందించడానికి అవకాశాలు నివేదికలో కల్పింపబడ్డాయి.

నిర్మింపబడబోయే యీ భారీయంత్రోత్పత్తి యంత్రాగారాలు, కాస్టింగ్, ఫోర్జింగ్‌ను ఉత్పత్తిచేసే యంత్రాగారాలు, సోవియట్ దేశపు అత్యంత పెద్ద యంత్రాగారాలైన ఉరల్స్‌లోని "ఉరల్‌మాష్", దొనెత్స్ గనుల ప్రాంతంలోని "నొవాక్రమ తోర్స్క్"ను పోలి వుంటాయి. భారత దేశంలోని భారీ పరిశ్రమలలోని, నిపుణులైన కార్మికులకు, ప్రధానోద్యోగులకు యీ యంత్రాగారాలు చక్కని శిక్షణా పాఠశాలలుగా వుపయోగపడగలవు.



# ప్రజా కళ

ఐ. కుజనెత్సోవ్

బాల్యంలో మీరెటువంటి కలలు కన్నారో నాకు తెలియదు. మీ స్మృతి పథంలో జీవిత పర్యంతమూ ఎటువంటి దేవతా కథలు విహరిస్తున్నవో.... నా మనస్సులో కళ్ళకు కట్టినట్టు నిలచివున్న ఒక దేవతా కథవుంది. అది నిప్పుపిట్టకథ. ఈ అద్భుత పక్షి యజమానిగా వున్న అదృష్టవంతుడెవ్వడో? దాని ఒక్క వెంట్రుకచాలు, ఆతనికి కావలసిన శక్తి నివ్వ దానికి! తన బంగారు రెక్కలను ప్రపంచం మీద పరచి, తన ప్రతిఒక్క వెంట్రుకమీద ఏడు ఇంద్ర ధనుస్సులు మెరుస్తూ వుండగా, సకల దేశాల సూర్యోదయ సూర్యాస్తమయ కాంతులతో ప్రకాశించే ఆ పక్షి ఎక్కడుంది?— ఎక్కడుందది?

ఇదిగో, యిక్కడ నా ఎదట నుంది.... ఈ శేబులుమీద ఒక పడవ వుంది. దానిపైని ఒక అద్భుతమైన బంగారుపిట్ట తన రెక్కలను కప్పి వున్నది. నేను దాని దేశానికూడా వెళ్ళాను. అక్కడికి, దాని దేశానికి ఏడు సముద్రాలను దాటవలసిన అవసరం పడలేదు నాకు.

ఓల్గాతీరాన పురాతనమైన రష్యన్ గ్రామం ఖొక్లోమా వున్నది. దూరదూరాలనుండి ప్రజలక్కడికి వచ్చారు. దేశదేశాల కళాకారులు ఖొక్లోమా చెమ్చాలను తయారుచేసేవారి కళా రహస్యాన్ని కనుగొనడానికి ఎంతో ఆలోచించారు. ప్రపంచంలో యింకెక్కడా కూడా ఎవ్వరూ చెమ్చాలపైని యిలా చిత్రించలేరు. కప్పుల దిగువ బంగారు దేవతా కథలను నింపలేరు, పెట్టెలపైని అద్భుత జీవితాన్ని వివిధ వర్ణాలలో ప్రకాశింప జెయ్యలేరు. "వారు సజీవానలంతో చిత్రిస్తారు...." కమలిన బంగారు రంగు రెక్కలను చూసినప్పుడు యీ కళాకారుల గురించి విదేశీయులన్న మాటలివి. "ఈ బంగారాన్ని వాళ్ళెక్కడ సంపాదిస్తారో?...." కాని ఖొక్లోమా కళాకారులు తమరహస్యాన్ని బయటపడనివ్వలేదు ఇది తండ్రినుండి కొడుకుకూ, కొడుకునుండి మనమలకూ సంక్రమిస్తూ వస్తోంది....

మేము ఖొక్లోమాలో ఒక అనువర్తిత కళా పారశాలకు వెళ్ళి, కళాకారులు పనిచేస్తూవుండడం గమనించాము. మా కళ్ళఎదుటనే కప్పులకు, చెమ్చాలకూ, పళ్ళాలకూ వెండి కళాయి వేయబడుతోంది, మిగతా జాగాలలో ఇంగిలీకమూ, మసి పూయబడుతున్నాయి. తరవాత వీటన్నిటికీ ఆరబెట్టే నూనెతో ఏడు చక్కని పూతలు పూయబడుతున్నాయి.

"బంగారం ఎక్కడుంది?"

యువక కళాకారులు వింతగా చిరునవ్వు నవ్వారు, తమ వస్తువులను ఒక పొయ్యిలో పెట్టుతూ. పొయ్యిలో నుండి చెమ్చాలనూ, కప్పులను, పళ్ళాలనూ బయటికి తీశాక, మేమందరమూ దిగ్భ్రాంతులమైపోయాము. వాటికి యీ పూతంతా ఎవరు పూశారు? బంగారం ఎక్కణ్ణుండి వచ్చింది?

"ఇక్కడ బంగారం లేదే" అన్నాడు పని చేస్తోన్న ఒక కుర్రవాడు, మావంక చూచి నవ్వుతూ. "ఆరబెట్టే నూనె క్రింద మెరుస్తోన్న అల్యూమినియం కళాయి యిది?"

ఖక్లోమాలో ఒక వస్తుప్రదర్శనశాల వుంది. ఇది ప్రేక్షకునికి గొప్పగా కనువిప్పుకలిగిస్తుంది. ఇక గదిలో చిన్న గుడిసెల నమూనాలున్నాయి. చెమ్చాలను కాల్చుతూ వున్నప్పుడు, పూర్వపు రోజుల్లో ఉక్కిరిబిక్కిరిఅయ్యేటట్టుగా పొగతో నిండి వుండేవి, ఎప్పుడూ యీ గుడిసెలు, శీతకాలం అంతటా తెల్లని ఆవిరి మేఘాలు తెరచి వున్న ద్వారబంధాల వద్ద తేలుతూ వుండేవి. ఈ తీవ్రమైన పొగవల్ల కళాకారులు అంధులయ్యేవారు. చిన్న పిల్లలు చలివల్ల జ్వరంతో

రష్యన్ కళాకారులు లేసుతో బిలుగు జిలుగు నమూనాలు, బంకమట్టితో వినోద ప్రతిమలు చేస్తారు. ఈ ప్రతిమలకు ఆకర్షణీయమైన రంగులు వేసి బంగారపు వన్నెల పొన్నులు పెడతారు

గుడిసెలో చీకటిలో పడివుండేవారు. చమ్చాలను తయారుచేసేవారు పొగవల్ల ఎర్రబారిన కళ్ళతో వీధివేపు చూసేవారు. గుడిసెముంగిట నున్న వృద్ధకళాకారులు. వంగిన నడుముతో తమ అంధ విద్యార్థులతో బ్రతుకు సాగించేవారు.

పాత దినాలలో జానపద కళాకారులు నికృష్టంగా జీవించిన గ్రామం యిదొక్కటేనా? అసమానులైన దగెస్తాన్ వెండిపనివారు అతి దరిద్రమైన కూలిడబ్బులకోసం పొద్దుగూకులూ పనిచేసేవారు. అద్భుతమైన రగ్గులను తయారు చేసే ఉజ్బెక్ బాలికలు ధూళితో ఊపిరి సలపక చీకటి గుడారాలలో క్షయవ్యాధితో చనిపోయేవారు. దూరానవున్న చుకోత్కాలో ఎముకపైని అద్భుతంగా చెక్కడపు పనిచేసే కళాకారులు వందలాదిగా నశించిపోయేవారు.

పలెఖ్‌లో జీవితం కూడా, వేలాది యితర రష్యన్ గ్రామాల జీవితం కంటె భిన్నంగా వుండేదికాదు. అదే కురచ గుడిసెలూ, అదే నిరక్షరాస్యత. అయినా నిరక్షరాస్యులు, కటిక దరిద్రులూ అయిన జనాభాగల యీ రష్యన్ గ్రామంలో నిజమైన అద్భుత కళాఖండాలను తయారుచేసిన సిద్ధహస్తులుండేవారు. ఈ కర్మాగారాలకు యజమానులైన ధనిక వ్యాపారులు యీ ప్రతిభావంతుల శ్రమ ద్వారా గొప్పగా ధనసంపాదన సాగించేవారు. "నేను ఒకయజమానివద్ద పూర్తిగా 45 ఏళ్ళు పనిచేశాను. అతనివద్ద పనిచేసిన రెండువందలమంది కళాకారులలో నేను ఉత్తముణ్నని భావింపబడినప్పటికీ, యించుమించు ఒక అర్ధశతాబ్దం పనిచేశాకగూడా నావద్ద చిల్లిగవ్వకూడా లేదు" అని మాకు చెప్పాడు పలెఖ్ గౌరవనీయ కళాకారుడు ఐ. బకనోవ్.

లక్క అట్టపెట్టెలమీద చిత్రింపబడిన పలెఖ్ చిత్రాలను, యీ నాడు చాలా చిత్రశాలలలో చూడవచ్చును. ఇప్పుడవి ఒక్క వస్తు ప్రదర్శన శాలల్లో మాత్రమే లేవు. వివిధ వర్ణ శోభితమైన కల్పనలతోనూ, అద్భుతమైన అలంకరణలతోనూ పలెఖ్ పేటికలు, చాలా సోవియట్ గృహాలలో కనిపిస్తాయి. సోవియట్ దేశానికి వెలుపల కూడా పలెఖ్ కళాభిమానులు చాలామంది వున్నారు. ఇది సహేతుకమే. జానపద కళాకారులు తయారుచేసిన వస్తువులు, అద్భుత కళామయాలు. దూర్బిణీతో చూస్తేనే తప్ప కనిపించనటువంటి చిత్రాలు అట్టపెట్టె అంతటా వున్నాయి. కొన్ని చదరపు సెంటీమీటర్ల జాగాపైని కళాకారులు చిత్రాలనూ, ప్రకృతి దృశ్యాలనూ చిత్రిస్తారు. సూదిగుండు ప్రమాణంలోవున్నా ఒకొక్క ముఖం స్పష్టంగా వుంటుంది. ఇదంతా బంగారు, వెండి పోగులతో అలంకరింపబడి వుంటుంది. లక్కతో మెరుగుదిద్దబడి అద్దంలాగామెరుస్తూవుంటుంది. చిత్రము రంగులతో విలువైన మాణిక్యాలలాగ తళతళలాడుతుంది....

"నేను రష్యాలో ఐదువారాలున్నాను. కాని నేను పలెఖ్‌లో గడిపిన యీవారం అన్నిట్లోనూ అద్భుతమైనది. ప్రజలలో విప్లవం మేల్కొల్పిన మహత్తర శక్తినంతట్నీ కళ్ళారా చూశాను"(రష్యన్‌నుండి ఇంగ్లీషులోనికి మళ్ళీ అనువదింప బడింది)అంటూ పలెఖ్‌లోని ప్రేక్షకుల పుస్తకంలో అమెరికన్ రచయిత ఆల్బర్ట్ రైస్ ఊరకనే వ్రాయలేదు.

మాస్కో మధ్యలోవున్న ఒబుఖ్ వీధిలో ప్రాచ్య సంస్కృతీ వస్తుప్రదర్శనశాల ఒకటి వుంది. చాలా భారత దేశం, చైనా, కొరియా, బర్మా ప్రజల జాతీయ కళావస్తు సముదాయమే కాకుండా, మధ్యాసియాలోని సోవియట్ రిపబ్లిక్కుల ప్రాచీన అధునాతన కళావస్తువులూ కూడా దీనిలో వున్నాయి.

తుర్క్‌మేనియా, ఉజ్బెకిస్తాన్, కిర్గీజియా, తజికిస్తాన్, కజకస్తాన్ అధునాతన జానపద కళాకారుల కళా ఖండాలున్న హాల్సులో ప్రవేశిస్తూ కనుల పండువైన వర్ణసముదాయాన్నీ, రూపసముదాయాన్నీ మనంచూస్తాము. తుర్క్‌మేనియా జాతీయ ఆభరణాలకు చెందిన అనుకరింపరాని చిత్రాలూ, వర్ణాలూ అక్కడ వున్నాయి. వాటి తరవాత కజక్ రగ్గుల చక్కని రేఖలూ, తళతళలాడే రంగులూ, ఉజ్బెక్ కుటుపని వారి వస్తువులూ, గొప్పగా



వెండిమీద నగిషీపని—కుబాచీలోని దగెస్తాన్ గ్రామం ఈ పనికి వాసికెక్కింది. కూజాలు, పాత్రలు, బాకు పిడులు, పట్టా కత్తులు మొదలైనవి అనేక గ్రామీణ కళాప్రదర్శనలలో ప్రదర్శితమైనాయి. మధ్యాసియా నేత పారిశ్రామికులు తయారుచేసే సుందరమైన తివాసీలకు మా దేశంలో బహుళమైన ప్రాచుర్యం వున్నది

అలంకరింపబడిన తజిక్ దుస్తులూ, డిప్ప టోపీలూ, బంగారు, వెండికంకణాలు, కప్పులూ, పిడులు పొదిగిన ఖడ్గాలూ, చిన్న ఉజ్బెక్ బల్లల అందమైన చెక్కడపుపనులూ వున్నాయి. గిప్సం, మట్టి కాల్చి చేసిన కృత్రిమపు రాతిపైని (గాంచ్) ఎంత అందమైన చెక్కడపు పని, చిత్రలేఖనం చేయబడి నది! సోవియట్ కాలంలో పునర్జన్మించిన ఒక ప్రాచీన మధ్యాసియా కళ అది. ప్రత్యేక రూపంలో వున్న ఉలులను ఉపయోగించి, కళాకారుడు దానిపైని వివిధ విగ్రహాలనూ, అలంకారాలనూ చెక్కుతాడు.

ఇక్కడ అద్భుతమైన తరు శాఖలు, పత్రాలూ చెక్కబడి వున్నాయి. ఈ క్లిష్ట అలంకారాలలోని అతి రమ్యమైన రేఖలను చూసి ఎవ్వరైనా ముగ్ధులుకాక తప్పదు. గాంచ్ చెక్కడపు పని ముఖ్యంగా మా కాలంలో బాగా వ్యాప్తి గాంచింది. ఉజ్బెక్ చెక్కడపు పనివారుచేసిన గాంచ్ వస్తువులు రిపబ్లిక్‌లోనూ, దానికి వెలుపలా వాసికెక్కాయి. మాస్కోలోని సోవియట్ దేశ వ్యవసాయ ప్రదర్శనంలోని 'ఉజ్బెకిస్తాన' ప్రదర్శనశాలను అలంకరించివున్న మక్సుద్ కసిమోవ్, ఆయన మిత్రులూ తయారుచేసిన కళాఖండాలను చూసి లక్షలాది మంది సోవియట్ ప్రజలూ, విదేశాలనుండి వచ్చిన ప్రేక్షకులూ ప్రశంసించారు. ప్రముఖ బొఖారా గాంచ్ చెక్కడపు పనివాడయిన ఉస్తాషిరిన్ మురదోవ్ ఎంతో కీర్తి సంపాదించాడు. ఈయన గౌరవనీయుడైన కళాకారుడు, ఉజ్బెకిస్తాన విజ్ఞానశాస్త్ర పరిషత్తు గౌరవ సభ్యుడు. ఈయన వంటి కళాకారులు పందలాదిమంది వున్నారు. అన్నిటికంటె ముఖ్య విషయమేమిటంటె యువతరానికి చెందిన చెక్కడపు పనివారూ, రగ్గులను నేసేవేరూ, ప్రత్యేకమైన ప్రభుత్వ పాఠశాలలలో చదివిన, చిత్రాలు చెక్కే పనివారూ యింకా ఎంతోమంది వున్నారు. ఈ పాఠశాలలలో వృద్ధజానపదకళాకారులు వారికి విద్యను నేర్పుతారు.

మా మహా దేశంలోని అన్ని ప్రాంతాలలోనూ-పలెఖ్, దిమ్‌కోవోఅన్న ప్రాచీన రష్యన్ గ్రామాలలోనూ, అద్భుతమైన చెక్కడపు పనివారు చేస్తో



కొయ్య దిప్పన్లకు నగిషీపనిచెయ్యడం 'ఖొక్లోమా' కళాకారుల సంప్రదాయకవిద్య

పలేఖ్ పురాతన ప్రసిద్ధ చిత్రకారులకు తమ చిత్రాలలో దేవతా కథలను చిత్రించడం ఎంతో ఇష్టం. దిగువ నున్నది ఒక కథాచిత్రం

నవజీవనం ఫలెఖ్ కళాకారుల చిత్రణకు నవ్య భావాలను చేకూర్చింది. ఒకపెద్ద మూతమీద సమిష్టి వ్యవసాయదారులు విశ్రాంతి తీసుకోవడం చిత్రితమైంది.

న్న దగెస్తాన్ గ్రామం కుబచీనోనూ—జీవించే సకల జాతులకూ చెందిన ఎంతోమంది కళాకారులకు ప్రజా ప్రభుత్వం స్వేచ్ఛాయుత మయిన నవజీవనాన్ని ప్రాప్తింపజేసింది. అది యీ నవజీవనాన్ని తజిక్ గ్రామాలకూ, ఉక్రేనియన్ కుమ్మర్ల గృహాలకూ లభింపజేసింది. జీవితాన్ని సౌందర్యవంతం గావించే కళలను సృష్టిస్తూ ప్రతిభావంతులైన సోవియట్ ప్రజలు కృషిచేస్తోన్న నగరాలనూ, గ్రామాలనూ, కొండప్రాంతాలనూ; స్టెప్పీలనూ అన్నిటినీ పేర్కొనడం సాధ్యంకాదు.

అప్పుడప్పుడు జరిగే ప్రదర్శనలూ, మాస్కోలో ఏర్పరుపబడే జాతీయ కళోత్సవాలూ యిందుకు చక్కని దృష్టాంతాలు, ఇటీవల జరిగిన ఇస్తోనియన్ కళోత్సవం నటగాయకుల. రచయితల నైపుణిని మాత్రమే కాకుండా, జానపద కళాకారుల నైపుణిని కూడా ప్రదర్శించింది. ఈ సంవత్సరం కిర్గిజ్ కళోత్సవం జరుగుతుంది. వేలాదిమంది కళాకారులు యీ ఉత్సవాల కోసమూ, ప్రదర్శనల కోసమూ సన్నాహాలు సాగిస్తున్నారు. సిద్ధహస్తులైనవారు యీ మధ్య సృష్టించిన ఉత్తమ కళాఖండాలను మాస్కోలో ప్రదర్శించేందుకు, వారు నూతన ప్రదర్శనల కొరకు కృషిచేస్తున్నారు.

మాస్కోలోని లెనిన్ ప్రభుత్వ గ్రంథాలయంలో రష్యన్ సమాఖ్య అనువర్తిత, అలంకార కళాప్రదర్శనం పెద్ద ఎత్తున యిటీవలనే ప్రారంభమైంది. ఈ ప్రదర్శనంలో యెన్ని అద్భుత కళాఖండాలు, ఎంతటి ప్రతిభా వైవిధ్యమూ ప్రదర్శితమైనాయి!

దిమ్కోవో కళా సహకార సంఘం వస్తువులను ప్రదర్శించే ప్రత్యేకమైన తావులున్నాయి. దిమ్కోవో గ్రామం చక్కగా చిత్రింపబడిన, బంగారు రంగు మట్టి బొమ్మలకూ, ఈలలకూ, గమ్మత్తయిన విగ్రహాలకూ చాలాకాలంగా



కొయ్య కూజాలు, పెట్టెలకు తేజోవంతంగా ఖొకొలోమా కళాకారులు నగిషీ పెట్టి, వాటిని అలంకారాలుగాను, గృహోపయోగానికి వినియోగమయ్యేట్టుగాను చేస్తారు.



పేరుకెక్కింది. ప్రాచీనకాలపు పాటలలోనూ, శైలినాలలోనూ గల భావం, దిమ్‌కోవో సిద్ధహస్తుల వస్తువులలో స్ఫురణకు వస్తుంది.

యకూతియాకు చెందిన ఎముకపై చేసిన చెక్కడపు వస్తువులు (వాల్రుస్, మామ్మత్ మృగాల ఎముకలతో చేసినవి) ఒక ప్రత్యేకమైన హాలులో ప్రదర్శింపబడి వున్నాయి. అవి సాంప్రదాయకమైన జానపద భావాలకూ (ఉత్తరాది కుక్కబట్లు, తెల్ల ఎలుగుబంట్లు, వాల్రసులూ, రైన్‌డీర్లు), నేటి భావాలకూ కూడా (సోవియట్ దేశంలోని ప్రముఖుల ఉత్పత్తి చెక్కడపు బొమ్మలు, అందంగా చెక్కి తయారు చేసిన పేటికలూ) ప్రాతినిధ్యం వహిస్తాయి.

తరవాత హాలులో బొగొరొద్‌స్కకు చెందిన కర్రపైని చెక్కడపు పని చేసేవారు తయారు చేసిన వస్తువులున్నాయి. అందమైన గుర్రం రైన్‌డీర్ బొమ్మలపైని, ట్రాయికాస్, వేటగాళ్ళ బొమ్మలపైని స్పష్టమైన శిల్పరేఖలు గోచరమవుతాయి. వీటిని సిద్ధహస్తులైన కళాకారులు నైపుణ్యంతో చెక్కి తయారు చేశారు. ఇవన్నీ సామాన్యమైన కర్రపైని కాకుండా, అపురూపమైన లోహాలపైని, ఎముకలపైని చేసినట్టుగా

---

తజిక్ కళాకారులు దారుపేటికకు నగిషీ చేస్తున్నారు
(పైన)
ఉజ్‌బెక్ నిపుణులు చెక్కడపు పని చేసిన
కొయ్య బల్ల (ఎడమ)





కనిపిస్తాయి.

కాస్లీకి చెందిన ఇనుపపోత విగ్రహాలు (యిది ఉరల్స్‌లోని ప్రఖ్యాతమైన ఒక చిన్ననగరం) కూడా యిక్కడ ఎక్కువగా వున్నాయి. కార్మికుడు, సమిష్టి రైతు స్త్రీ, సోవియట్ సైనికుని విగ్రహాలలో గొప్పశక్తి కనిపిస్తుంది ఇక్కడ డాన్ క్విక్సోట్ వున్నాడు, అసందర్భంగా కనిపించే శిరస్త్రాణంతో వున్న పొడవాటి వింత విగ్రహం అది. అయినా, తన ఖడ్గానికి ఆనుకుని వున్న ఆ విషాదవీరుని విగ్రహంలో ఎంతో రీవి వుంది. అతడు సజీవుడై వున్నట్టు కనిపిస్తున్నాడు ఏక్షణాన్నయినా కత్తిని ఒరలో పెట్టేసి తన విశ్వాస పాత్రుడైన శాంకోను పిల్చేటట్టుగా వున్నాడు. ఈ ఇనుప విగ్రహాలన్నీ చూస్తే మరపు రావు

ఒలోగ్దా లేసుపనివారు తయారుచేసిన వాటితో కిటికీలకు తెరలు కట్టబడ్డాయి. చాలా చక్కగా, ముచ్చటగా వున్న రకాలూ, తేలికగా, గాలి ప్రసరించడానికి వీలుగా, స్పష్టంగా వున్న డిజైజన్లు ఎవరినైనా ఆశ్చర్య పర్చుతాయి ఈ జానపద కళ, జీవితం లాగనే సుందరమైనది, వైవిధ్యం గలది

---

మాస్కో మండల కళాకారులు ఆకర్షణీయమైన, సుందరమైన, కర్రతో చేసిన ఆట బొమ్మలు (పైన)

ఉజ్‌బెక్ కళాకారులు తయారుచేసిన వాయిద్య వస్తు సంచయం (దిగువ)





# సోవియట్ దేశ సుప్రీం సోవియట్ ఆరవ సమావేశం

నాల్గవ, సోవియట్ దేశ సుప్రీం సోవియట్ ఆరవ సమావేశం ఫిబ్రవరి 12వ తేదీన ముగిసింది. అది ప్రభుత్వానికీ, ఆర్థిక, సాంస్కృతిక నిర్మాణానికీ, అంతర్జాతీయ పరిస్థితికీ, విదేశాంగ విధానానికీ సంబంధించిన అత్యంత ప్రధాన సమస్యలను చర్చించింది: సామ్యవాద ఆర్థిక సాంస్కృతిక శాఖ లన్నిటి యితోధికాభివృద్ధికీ, ప్రజల సంక్షేమాభివృద్ధికీ, అన్ని యూనియన్ రిపబ్లిక్కుల సౌభాగ్యాన్ని పెంపొందించడానికీ, సోవియట్ దేశ వివిధ జాతుల మైత్రిని బలపరచడానికీ, అత్యంత ప్రాముఖ్యంగల నిర్ణయాలను చేసింది. అది సోవియట్ ప్రభుత్వ విదేశాంగ విధానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించింది.

ఉభయ సభలకు చెందిన బడ్జటరీ, లెజిస్లేటివ్ ప్రతిపాదనల సంఘాలు అన్ని యూనియన్ రిపబ్లిక్కుల ప్రతినిధులు పాల్గొనగా బిల్లులను జాగ్రత్తగా తయారుచేసి సమావేశానికి సమర్పించాయి. ఈ సమావేశంలో జరిగిన చర్చలలో ప్రతినిధులు అతిచురుగ్గా పాల్గొన్నారు.

సుప్రీం సోవియట్ ఆమోదించిన 1957 సంవత్సరపు జాతీయార్థిక ప్రణాళిక ప్రకారం భారీ పరిశ్రమాభివృద్ధికి అన్నిటికంటె ప్రాధాన్యత యివ్వడం కొనసాగుతుంది; యీ ఒక్క దృఢమైన ప్రాతిపదిక మీదనే, వ్యవసాయక, నిత్య వినియోగ వస్తువుల ఉత్పత్తిలో మరింత పెరుగుదలా, సోవియట్ ప్రజల సంక్షేమ క్రమక్రమాభివృద్ధీ సాధింపబడతాయి.

ప్రతిచోటా—అంటే ప్రతి పారిశ్రామిక సంస్థలోనూ, ప్రతి నిర్మాణ కార్యంలోనూ, ప్రతి ఉత్పత్తి శాఖలోనూ సాధ్యమైనంత తక్కువగా ప్రభుత్వనిధులూ, శ్రమ కర్చుచేయడంతో అత్యుత్తమ ఫలితాలు సాధించడం అతి ముఖ్య కర్తవ్యమని సుప్రీం సోవియట్ సమావేశాలలో ప్రత్యేకంగా నొక్కి చెప్పబడింది.

వ్యవసాయ రంగంలో పనిచేసేవారు, 1957లో ఘనవిజయాలు సాధించవలసి వుంది. గడచిన ఏడాది వారు ఉత్తమ కృషిచేశారు. మా దేశం 1956లో పండించినంత ధాన్యం, గతంలో ఎన్నడూ పండించలేదు.

సోవియట్ ప్రభుత్వం ప్రజల భౌతిక, సాంస్కృతిక ప్రమాణాలను అభివృద్ధి చేయడమే తన ప్రధాన కర్తవ్యంగా సర్వదాభావిస్తూ వచ్చిందనీ, యిప్పుడు భావిస్తూందనీ 1957వ సంవత్సరపు జాతీయ ఆర్థిక ప్రణాళిక సుస్పష్టంగా వెల్లడిస్తూంది.

మా దేశంలో గృహనిర్మాణం పెద్ద స్థాయిలో జరుగుతూంది. ఒక్క అయిదవ పంచవర్ష ప్రణాళికా దశలోనే దేశంలో మొత్తం 15 కోట్ల 17 లక్షల చదరపు మీటర్ల నివాస స్థలంపై గృహనిర్మాణం జరిగింది. 1956లో 3 కోట్ల 60 లక్షల చదరపు మీటర్ల స్థలంలో గృహనిర్మాణం జరిగింది. గడచిన ఏడాది గృహనిర్మాణానికై ప్రభుత్వపు కేపిటల్ పెట్టుబడులు 2500కోట్ల రూబుల్సు అయితే, 1957లో ఇందునిమిత్తమై 2990 కోట్ల రూబుల్సు కర్చుచేయబడుతుంది. ఈ డబ్బుతోనూ, ప్రభుత్వ ఋణాల సాయంతో ప్రజలు కర్చుపెట్టే డబ్బుతోనూ యీ ఏడాది 4 కోట్ల 60 లక్షల చదరపు మీటర్ల స్థలంపై గృహాలు నిర్మింపబడతాయి—ఇది గత ఏడాదికంటే నూటికి 28 వంతులు యెక్కువ.

ఈ సమావేశం చేసిన చట్టాలు గొప్ప ప్రాముఖ్యం గలవి. యూనియన్ రిపబ్లిక్కుల హక్కులను అధికం చేయడానికీ, ఆర్థిక సాంస్కృతిక నిర్మాణంలో వాటి పాత్రను పెంపొందించడానికీ సోవియట్ ప్రభుత్వం అనుసరిస్తున్న విధానానికి మరింతగా దోహదం చేయడానికి అవి ఉద్దేశించబడ్డాయి.

ఇంతకు మునుపు, జ్యూడీషియరీకి, లీగల్ ప్రొసీజరుకూ సంబంధించిన చట్టాలు చేయడమూ, సివిల్, క్రిమినల్, ప్రొసీజరల్ కోడ్స్‌కు సంబంధించిన చట్టాలు చేయడమూ యూనియట్ ప్రభుత్వ అధికారం క్రింద ఉండేవి. ఇప్పుడు సుప్రీం సోసియట్ చేసిన కొత్త చట్టాన్ననుసరించి అవి యూనియన్ రిపబ్లిక్కుల అధికారం క్రిందకు వెళ్ళేయి.

ఇందువల్ల మా శాసన నిర్మాణాన్ని అభివృద్ధి చెయ్యడానికీ, చట్టాలను జీవితానికి మరింతసన్నిహితంగా చేయడానికీ, ప్రతి రిపబ్లిక్ యొక్క ప్రత్యేక జాతీయ లక్షణాలను బాగా గణనలోకి తీసుకోవడానికీ వీలవుతుంది. శాసన నిర్మాణ మూలసూత్రాలను ఏర్పరచడం యూనియన్ ప్రభుత్వాధికారం క్రిందనే వుంటుందని వేరే చెప్పనవసరంలేదు; ఎందుకంటే సోవియట్ శాసన నిర్మాణం సామ్యవాద ప్రజాసామ్య సూత్రాలనూ, భావాలనూ వ్యక్తం చేసే ఒక విధమైన శాసన నిర్మాణంగా వుంటూవచ్చింది, వుంటుంది కూడాను. "సమాఖ్య అంతటికీ ఒక విధమైన చట్టాలు చేయడాన్నీ," అదేసమయంలో "స్థానిక పరిస్థితులన్నిటినీ గణనలోకి తీసుకోడాన్నీ" కచ్చితంగా పాటించవలసిన అవసరం గురించి లెనిన్ సిద్ధాంతానికి యిది పూర్తిగా అనుగుణంగా వుంది. ప్రాంతాలలోనూ, రాష్ట్రాలలోనూ పరిపాలక— ప్రాంతీయ ఏర్పాట్లకు సంబంధించిన సమస్యలను పరిష్కరించే హక్కును సోవియట్ దేశ సుప్రీం సోవియట్ యూనియన్ రిపబ్లిక్కుల కిచ్చింది. దీనివల్ల అటువంటి సమస్యలను పరిష్కరించడములో అందరికంటె యూనియన్ రిపబ్లిక్కులకే బాగా తెలిసిన

ఆర్థిక, భౌగోళిక పరిస్థితులనూ, జనాభా విషయాన్నీ, తదితర ప్రత్యేక లక్షణాలనూ బాగా గణనలోకి తీసుకోవడం సాధ్యమవుతుంది.

సోవియట్ దేశ సుప్రీంకోర్టు చట్టంగురించి సుప్రీం సోవియట్ చేసిన నిర్ణయంకూడా గొప్ప ప్రాముఖ్యం గలది. ఈ చట్ట రీత్యా యూనియన్ రిపబ్లిక్కుల న్యాయశాఖలచే పరిశీలించబడిన కేసుల విషయంలో సుప్రీంకోర్టు పర్యవేక్షణ పరిమితం చేయబడింది. సాధారణంగా యిప్పుడు కేసులపర్యవేక్షణ యూనియన్ రిపబ్లిక్కుల న్యాయశాఖలలోనే పూర్తి అవుతుంది. ఇందువల్ల యూనియన్ రిపబ్లిక్కుల హక్కులు ఎక్కువవుతాయి; చట్టం పాటించబడేట్టు చేయడంపట్ల వాటి బాధ్యత పెరుగుతుంది; సోవియట్ దేశ సుప్రీం కోర్టు, ఆచరణలో కోర్టుల పనిని సాధారణీకరించిడం పట్ల, సోవియట్ శాసన నిర్మాణాన్నీ, లీగల్ ప్రొసీజర్నూ మరింత అభివృద్ధి చేయడంపట్ల తన దృష్టిని కేంద్రీకరించడానికి వీలు కలుగుతుంది.

ఈ సమావేశం చేసిన చట్టాలూ, జాతుల సోవియట్‌కు చెందిన ఒక ఆర్థిక సంఘాన్ని నెలకొల్పడానికి ఆ సభ చేసిన నిర్ణయమూ, అన్ని యూనియన్ రిపబ్లిక్కుల మైత్రీ సహకారాలను మరింత పటుతరం చేస్తాయి.

సోవియట్‌దేశ సుప్రీం సోవియట్ అంతర్జాతీయ పరిస్థితిని గురించీ, విదేశాంగ విధాన సమస్యల గురించీ చర్చించింది. సోవియట్ ప్రభుత్వం యొక్క శాంతియుత విదేశాంగ విధానం అచంచలమైనదని సోవియట్ విదేశాంగమంత్రి షెపిలోవ్ నివేదికలోనూ, ప్రతినిధుల ప్రసంగాలలోనూ మరొకసారి నొక్కి చెప్పబడింది. విభిన్న సాంఘిక వ్యవస్థలతో కూడిన రాజ్యాల శాంతియుత సహజీవనమనే వి. ఐ. లెనిన్ సూత్రంమీద ఆధారపడిన యీ విధానం ఒక అత్యంత ముఖ్యమైన సిద్ధాంతాన్ని—అంటే, ప్రస్తుత పరిస్థితులలో, సామ్యవాద, పెట్టుబడిదారీ విధానాల మధ్య యిప్పుడు రూపొందిన శక్తుల అన్యోన్య సంబంధంవల్ల యుద్ధం అనివార్య ప్రమాదం కాదు. శాంతికాముక దేశాలన్నిటి సంయుక్త కృషితో దానిని నివారించవచ్చుననే సిద్ధాంతాన్ని ప్రతిబింబిస్తూంది. సోవియట్‌దేశ విదేశాంగ విధానకృషి అంతాకూడా సమస్త మానవజాతి వాంఛల కనుగుణ్యమైన యీ మహత్తర లక్ష్య సాధనకే దోహద మవుతూంది.

---

## సోవియట్ దేశంలో భారత రిపబ్లిక్ దినోత్సవం

(4వ పుట తరువాయి)

సంఘం ఏర్పాటుచేసిన ఉపన్యాసాలకూ, నివేదికలకూ చాలమంది కార్మికులు, ఇంజినీర్లు, సాంకేతిక నిపుణులూ హాజరైనారు. ఈ సందర్భంలో రాజకీయ విద్యా మందిరంలో ఒక ప్రదర్శన జరిగింది.

భారత రిపబ్లిక్ సప్తమ వార్షికోత్సవాగమ సమయాన మిన్‌స్క్‌లోని కిరోవ్ యంత్ర పరికర నిర్మాణ కర్మాగారం భారత దేశానికి, అక్కడ నిర్మాణంలో వున్న ఇనుము, ఉక్కు పరిశ్రమకోసం మూడు కొత్త అర్ధ-స్వయంచాలన కోతలేత్‌లను పంపింది.

భారత రిపబ్లిక్ దినోత్సవాన్ని సోవియట్ ప్రజలు దేశంలోవియితర ప్రాంతాలలో కూడా, యీ విధంగా జరిపారు. నిజానికి జనవరి 26వ తేదీ సోవియట్ ప్రజలకూ భారత-సోవియట్ మైత్రీ దినమైంది; వారా రోజున పాత మైత్రీ సంబంధాలను దిట్టపరిచి, భారత ప్రజలతో యింకా దృఢతరమైన సంబంధాలను ఏర్పరుచుకోవడానికి ప్రతిన పూనారు.

---

## మాస్కో టెలివిజన్, రేడియోలలో సోవియట్ దేశానికి భారత రిపబ్లిక్ రాయబారి శ్రీ మీనన్ ప్రసంగం

(8 వ పుట తరువాయి)

1956 లో అనేక అధికార, అనధికార ప్రతినిధివర్గాల రాకపోకలు, శాస్త్రజ్ఞులు, పండితులు, కళాకారులు ఒకరి దేశాన్నొకరు సందర్శించడం చాల ఎక్కువగా జరిగింది. ప్రస్తుతం భారతదేశంలో వున్న అత్యంత ప్రముఖ సోవియట్ అతిధి మార్షల్ జుకోవ్, ఉత్తేజకరమైన ఆయన మూర్తి ముఖ్యంగా మా సాయుధబలాల స్మృతి పథంలో మరువరాని ముద్రను వేస్తున్నాయనడానికి సందేహంలేదు. ఇదంతా భారత సోవియట్ దేశాల మధ్య సంబంధాలను పెంపొందించింది.

"రాబోవు సంవత్సరంలో మన ఉభయదేశాల మైత్రి వృద్ధి పొందుతుందనీ, మునపటికంటె మరింత బలపడుతుందనే ఆశను—నిజానికి విశ్వాసాన్ని—వెల్లడిస్తూ నేనీ ప్రసంగం ముగిస్తున్నాను."

రష్యన్ భాషలో "సోవియట్, భారతదేశాల మైత్రి చిరకాలం వర్ధిల్లు గాక!" అనీ, భారత దేశంలో అంటున్నట్లుగా "హిందీ-రూసీ భాయీ భాయి" అనీ అంటూ శ్రీ మీనన్ తన ప్రసంగం ముగించారు.

---

## సోవియట్ ప్రజలకు భారతీయుల కానుక

(8వ పుట తరువాయి)

చేయబడినవి. ఇతర బహుమానాలకు ఇవి అందమైన వెనుక భాగంగా వున్నాయి. వీటికి చేర్పుగా రెండు కర్ర చెక్కడపు తెరలున్నాయి. ఇవి లేసులాగా వున్నాయి. చెక్కడపు పని అంతఅందంగా, అంత సున్నితంగా వుంది. ఎదుట, తెరలకు ముందర అందంగా తయారు చేయబడిన రెండు మహాగనీ ఏనుగుల శిల్పాలున్నాయి. మధ్యను వివిధ వస్తుజాలంతో నిండిన మూడు మేజాలున్నాయి—అవి దంతం పైని, లోహంపైని చెక్కినవస్తువులు, రంగు ఎనామిల్ వస్తువులూ మొదలైన వెన్నో. వెండి ఫిలిగ్రీ వస్తువులు నాకు ప్రత్యేకంగా చాలా నచ్చాయి. అవి ఒక ఓడనమూనా, రెండు ఏనుగుల ఆకారంలో వున్న ఒక టేబులుగంట, యితర వస్తువులు వాటి అద్భుతమైన పనితనంతోనూ, చక్కదనంతోనూ హత్తుకపోతాయి. చక్కని వర్ణ పేటికలూ అలంకృతమైన పాత్రలూ కనులు పండువుగా వున్నాయి. ఏనుగ దంతాల చట్రంలోవున్న తాండవశివుని చక్కని విగ్రహంగల అలంకృతమైన ఒక తెర కానుకల ప్రదర్శనకు మకుటాయమానంగా వుంది.

భారతీయులైన చేతికళాకారులకు పుష్కలంగా వున్న ప్రతిభా, పరిశ్రమలతో కూడిన యీ సుందర వస్తువులను చూసిన తరవాత తప్పక కలిగే ఆనందంతో నేను వస్తుప్రదర్శనశాలలుండి బయటికి వచ్చాను.

# మంచీ చెడూ



అందరికీ తెలుసును.
హోరు గాలి మళ్ళి
మంచు వాన వెలిసి
పొలాలలో పెద్దలకు
వనాలలో పిల్లలకు
సూర్యకాంతి సోక
హాయి కలుగు నందరికీ
అది ఎంతో మంచిది.
వాళ్ళంతా మట్టికొట్టుకొని
గడ్డందాకా బుగ్గలు దోక్కుపోయిన



ఇంతింత ప్రశ్న లడిగిన బుడతడు
తండ్రిని తెలియజెప్ప మన్నాడు :
"ఏది మంచి, ఏది చెడో ?"
ప్రతిదీ రహస్యమని దాచే రకాన్నికాదు
నేను, చూడు—నా పుస్తకంలో రాశాను
తండ్రి, బుడతడి కిచ్చిన జబాబు :

హోరుగాలి వీచి
ఇంటి కప్పులేచి
ఝోరని వానా మంచూ
పడడం చెరుపని



తోటి వాళ్ళతో కేలుకలిపి అడమనే
వాణ్ణిచూడు. నే చెప్పక్కర్లేదుకదూ
ఇక్కడ వాణ్ణిగూర్చి ఎంతైనా వ్రాయొచ్చుని:
వాడెంతో మంచివాడు.

'యన్గ్ అక్టోబర్' పత్రిక రాసింది
బొమ్మలు పోగొట్టుకొనే పిల్లలు
బొమ్మలు చెడగొట్టుకొనే పిల్లలు
పెద్దవాళ్ళ లెక్కలోకి ఎక్కి తీరుతారని.
ఆడుతు పాడుతు 'హోం వర్క్'
చక్కగ చేసుకొనే బాలుని





గుంటడికి చెబుతాయి, వాడికి పడ్డ గాట్లు
వొంటి కవే చెరుపని, ఎంతో అసహ్యమని.
మల్లెపువ్వులాంటి వాడు, శుభాంగుడు
తోముకుంటాడు తెల్లగా పండ్లు
ఫక్కున వాడు నవ్వితే పట్టపగలవుతుంది
అందరూ అంటారు వాణ్ణి ఎంతో మంచివాడని.
తనకన్నా చిన్నవాణ్ణి, కొడుతున్నాడా పోకిరి
చూడ కసలు వాడివంక, వాణ్ణిగూర్చి
నా పుస్తకంలో రాయను ఒక్క ముక్క.



# వి. మయాకొవ్‌స్కీ



చూడు చూడు ఆ పిల్లడు—
ఏ పక్షీ వాణ్ణి భయపెట్టలేదు,
వాటికన్న అతనూ ఏమంత పెద్దకాడు
ఆ మంచివాడు
వుండొచ్చును నా పుస్తకంలో ఇక్కడ.
ఆ వొచ్చే వాడు చూడు,
బురదలోన పొర్లాడుతు
పొయ్యిలాగు పాడు మొహం



పోల్చవచ్చు ఏమరపెరుగని
మొదటి తరగతి స్కూటుకు.
అతన్ని గురించే మేము
రాస్తాము అవిరళంగ,
పావురమ్మ భయపెడితే కేకలిడుతు పరుగెత్తిన
ఆ పిల్లడు, పాపం...వొర్తి పిరికిపంద
నా పుస్తకంలోంచి జారుకుంటాడు చల్లగ.
పిరికితనం
బిడ్డా,—
బహూ చెడ్డది.



పరిశుభ్రంగా వుండేటి వాడు
మంచివాళ్ళ కందరికీ మార్గదర్శి అవుతాడు.
పెరిగి పెద్దలయ్యే దీపిల్లలె
చిన్ననాటి శుచివర్తన
ప్రతిఫలించు పెద్దలందు.
ఈ పలుకుల నాలకించి
బుడతడు తండ్రికి చెప్పెను.
"ఎది మంచి, ఏది చెడో
స్పష్టంగా తెలిసిన దిప్పుడు
చెడ్డదారి త్రొక్కనింక
మంచిగానె నడచుకొందు."



ఎవరూ వెళ్ళరు చెంతకు
మురికివాణ్ణి ముట్టుకోరు
అవునవును,
వా డసలుకు చెడ్డవాడు.
ఈ కుర్రడు పరిశుభ్రుడు
ఉపయోగిస్తాడు బ్రషులు
ఎక్కడికైనా వెళ్ళివచ్చినప్పుడు
బూట్లు విప్పి శుభ్రం చేసుకుంటాడు కాళ్ళు.
ఎంత చిన్నవాడైనా ఈ బాలుడు



# రష్యన్ సంగీత నాటకావతరణ

టి. పొతాన్స్కాయా, యల్. స్మిర్నోవా



గొప్ప రష్యన్ వాగ్గేయ కారుడైన మిహాయిల్ గ్లింకా జీవితకాలానికీ మనకూ మధ్య అనేక దశాబ్దాలు గడచిపోయాయి. కాని ఉత్తేజ కరమైన సుందర సంగీతం యీ నాటికీ నవనోన్మేషంగా వుంది.

సంగీతంలో గ్లింకా స్థానం, సారస్వతంలో పుష్కిన్‌కువున్న స్థానం వంటిది. వీరిరువురూ తమతమ కాలాల అభ్యుదయకర ఆదర్శాలను, ప్రజల ఆత్మనూ, ఉన్నత దేశభక్తినీ, జీవితాను గుణ్యతనూ వ్యక్తపరిచారు.

తన సంగీ వస్తువును, ఉత్తేజాన్ని గ్లింకా యుగయుగాలనాటి ప్రజా సారస్వతంనుండీ, అద్భుతమైన ప్రజాగాన మాధుర్యంనుండీ, నూతన జాతీయ సంగీతానికి పట్టుదలతో పథాన్ని నిర్దేశిస్తోన్న తన పూర్వుల అనుభవంనుండీ సేకరించారు.

ప్రజాగేయాల ఆత్మ, స్వభావమూ గ్లింకా రచనల్లో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. ఇది వాటిని స్థూలంగా రష్యన్ సంగీతానికి ప్రాతిపదికను గావించింది. తన "ఇవాన్ సుసనిన్"లో—గ్లింకాయే దీనిని గురించి "దేశభక్త్యాత్మక వీర-విషాద సంగీతనాటక" మని నిర్వచించారు—గ్లింకా యావత్ప్రజయొక్క విషాదగాథను వెల్లడించి, వ్యక్తియొక్క ఆత్మికనాటకాన్ని కళ్ళకు కట్టినట్టు చూపారు.

గొప్ప రష్యన్ కవియైన జుకోవ్‌స్కీ సలహామీద గ్లింకా, ఇవాన్ సుసనిన్ కథపైని దృష్టిని కేంద్రీకరించి, తన ప్రజల కొరకు, తన మాతృభూమికొరకు ప్రాణార్పణ గావించిన, తన ప్రగాఢ దేశభక్తి పేరిట ఆత్మత్యాగం చేసిన ఆ రష్యన్ కర్షకుని గురించి సంగీత నాటకాన్ని సమకూర్చారు.

రచయితలు, సంగీతజ్ఞులు, కళాకారులు ప్రతివారం జుకోవ్‌స్కీయింట్లో సమావేశమవుతూ వుండేవారు. వేసవిలో సెయింట్ పీటర్స్‌బర్గ్‌లోని శ్వేత రాత్రులలోనూ, బయట మంచు తుఫానులు రేగే శీతకాలపు దీర్ఘ సాయంత్రాలలోనూ వారు పద్యాలు చదివేవారు, సంగీతం వాయించేవారు, రష్యన్ కళల గురించి, వాటి భవిష్యత్తుగురించి చర్చలు చేసేవారు. "రష్యన్ కవితా భాస్కరు"డైన పుష్కిన్ ఈ సమావేశాలకు వస్తుండేవారు. మహనీయుడైన గోగోల్ అక్కడ తన "వివాహా"న్ని చదివారు; యిక్కడనే రష్యన్ సంగీత నాటక కల్పనకు సంబంధించిన భావం ఉదయించింది.

గ్లింకా రచించిన "ఇవాన్ సుసనిన్" 1836 నవంబరు నెలలో సెయింట్ పీటర్స్‌బర్గ్ బోల్షోయ్ నాటకశాలలో తొలిసారిగా ప్రదర్శింపబడింది. కనులు మిరుమిట్లు గొలిపే తెల్లని మంచు స్లెడ్జి బళ్ళక్రింద, బళ్ళ చక్రాల క్రింద నలిగిపోయింది, ప్రేక్షకులు ఆ చల్లని సాయంత్రం బోల్షోయ్ నాటకశాలవైపు వెళ్తుండగా.

ప్రస్తావనగీత ప్రథమ శ్రుతులు మ్రోగాయి, జానపదగీత మంతటి నిరాడంబరమైన గ్లింకా సుందర సంగీత నిర్మలనాదాలు ప్రదర్శనశాలలో ప్రవహించాయి.

తెర కదిలి ప్రక్కకు తొలగింది. మెల్లని గాలిలాగా విషాద, విచార, కోపాలు హాలంతటా అలముకున్నాయి (తుఫానుకు ముందర వీచే గాలి!) రంగస్థలంపైని రైతులున్నారు, హాలులో కూచున్నవారి

కోసం యావజ్జీవితమూ పాటుపడే రైతులు! హాలులోవున్న చాలా మందిచే మానవులుగా పరిగణింపబడని రైతులు! ఆ 'బానిసలే' యీ సంగీత నాటకానికి నాయకులు. వారి యోచనలు ఉన్నతమైనవి, వారి చర్యలు ఉదాత్తమైనవి, వారి భావనలు మనఃపూర్వకమైనవి. జీవితో కూడిన సంగీతం వారినీవిధంగా ప్రదర్శించింది. అది వారిని కీర్తించి హాలులోని శ్రోతలకంటె ఉన్నతులుగా చూపింది....

కొందరు శ్రోతలకు కోపంవచ్చింది. కొందరు ఉద్రిక్తులై ఆ సమయాన జరుగుతూన్న దానిని గురించి, జాతీయ సంగీత నాటకావతరణం గురించి, రష్యన్ సంగీత మహత్తర పథప్రారంభము గురించి ఆలోచించారు. రష్యన్ సంగీతంలో గ్లింకా ప్రాధాన్యంగురించి ప్రఖ్యాత విమర్శకుడు స్తాసోవ్ యీ వాగ్గేయకారుని మహనీయుడు పుష్కిన్‌తో సరిపోల్చుతూ "వీరిరువురూ రష్యన్ భాషను సృష్టించారు — ఒకరు కవితలోనూ, యింకొకరు సంగీతంలోనూ" అని చక్కగా నిర్వచించారు.

....చివరి అంకం తరవాత తెరపడింది, హర్షధ్వానాలతో హాలంతా ప్రతిధ్వనించింది. "....నేను దీర్ఘకాలంగా పడిన శ్రమ అత్యద్భుతమైన విజయాన్ని పొందింది...." అని గ్లింకా ప్రదర్శనానంతరం తన తల్లికి వ్రాసేరు. నిజంగా ప్రదర్శనం అద్భుతమైనది. ఈ వాగ్గేయకారుడు, ఆ రోజుల్లో ధనిక భూస్వామ్యనీచులు "సుసనిన్" సంగీతాన్ని కర్షక సంగీతమని అంటారని అనుకోలేదు....బహుశా అది దానికి నిజమైన గొప్ప ప్రశంసయేమో! "సంగీతం ప్రజల సృష్టి...." అన్నారు గ్లింకా. రష్యన్ సంగీతనాటకం "ఇవాన్ సుసనిన్" అక్షరాలా ప్రజల సంగీత నాటకం. ఇందువల్లనే రాజసభలో అది ప్రశంసింపబడలేదు. కాని దాని అమృతత్వం యిందులోనేవుంది.

కాలంలో మాస్కోకు తిరిగి వెళ్లాము. పెద్దపెద్ద ముద్దలు [illegible] రాజధానీ నగరంపైని కురుస్తోంది. భూగర్భ రైళ్లు అంతు లేక [illegible] ప్రజలను మోసుక వస్తున్నాయి. అవి చౌకును తొందరగా దాటి, హిమాచ్ఛాదనంతో వున్న నిశ్శబ్ద వృక్షజాలంగల చిన్న ఉద్యానవనాన్ని గడచి, ప్రపంచ ప్రఖ్యాతమైన సోవియట్ దేశపు అకెడిమిక్ బోల్షోయ్ నాటకశాల ముఖద్వారం వేపుకు వెళ్తున్నాయి.

ముఖద్వారపు విశాలమైన తలుపులపైని, అందమైన స్థంభాలపైని, మంచుమీదుగా భవిష్యత్తులోనికి పరుగెత్తుతూ వున్నట్టుగా కనిపిస్తోన్న నాలుగు అశ్వాలపైని జ్వలిస్తోన్న దీపకాంతులు ప్రసరిస్తున్నాయి. "ఇవాన్ సుసనిన్" సాగిపోతోంది. చాలా మందికి టిక్కెట్లే దొరకలేదు. హాలు కిక్కిరిసిపోయింది, టిక్కెట్లన్నీ అమ్ముడుపోయాయి. మహావాగ్గేయకారుడు, మహత్తర సంగీత నాటకం "సుసనిన్" రచయిత వార్షికోత్సవాన్ని యీనాడు దేశం జరుపుతోంది: అద్భుతమైన దేవతాకథ సంగీతనాటకం "రుస్లాన్, ల్యుద్మిల్లా" యొక్క, ఆకర్షణీయమైన ప్రేమ గాథలయొక్క, ప్రతిభావంతమైన వాద్య సంగీత కల్పనలయొక్క వార్షికోత్సవాన్ని జరుపుతోంది.

ప్రదర్శనం మొదలైంది.

కమ్మని సంగీత నాదాలతో హాలు ప్రతిధ్వనిస్తోంది. గ్లింకా సంగీతంతో ఆ హాలు పులకిత మవుతోంది. ఒక రంగం వెంబడిని యింకో రంగం సాగిపోతోంది. పెద్దపెట్టున హర్షధ్వానాలు సాగుతూవుండగా తెరలేస్తోంది, పడుతోంది.

అమరమైన, అందమైన సంగీతం. "సుసనిన్" అర్థంకాక, తిరస్కరింపబడిన కాలం గడిచిపోయి చాలానాళ్ళయిపోయింది. దాని సంగీతాన్ని "రైతు" సంగీతమన్నవాళ్ళు జాడలేకుండా యీ ప్రపం

మిహాయిల్ గ్లింకా



చాన్ని వదిలిపెట్టి వెళ్ళిపోయారు; వారిపేర్లు విస[illegible]యి.

ఈ వాగ్గేయకారుని ఉపజ్ఞాయుతమైన న[illegible]ంయింట్ పీటర్స్‌బర్గ్ ప్రభువులు ప్రశంసించలేకపోయారు. వ[illegible]్రజలన్నా, వారి కళలన్నా అసహ్యం. గ్లింకా రచించినది వారికోసం కాదు. ఆయన సంగీతరూపకం విస్తృత ప్రజానీకం కోసం. మహత్తర అక్టోబరు సోషలిస్టు విప్లవం తరవాత మాత్రమే గ్లింకా రచనలకు యీ ప్రేక్షకలోకం లభించింది.

ఇదుగో, ప్రేక్షకులు; బోల్షోయ్ నాటకశాలలోని అన్నిస్థానాల లోనూ, అనేక బాల్కనీలలోనూ కూర్చున్న అన్నివృత్తులకూ, అన్ని వయస్సులకూ చెందినవారు.

....రంగస్థలంపైని ఒక దట్టమైన అడవి చూపబడింది. మంచు భారానికి మెత్తని ఫిర్ చెట్ల కొమ్మలు వంగి వున్నాయి. ఒక్క మనిషి అడుగుజాడగాని, ఒక్కబాటగాని, ఒక్క రోడ్డుగాని నేలపై నున్న మంచులో కనిపించడంలేదు.

ఆ దట్టమైన అడవిలోనికీ సుసనిన్ అనాహూతులైన అతిథులను తీసుకవస్తున్నాడు. వీరు దాడిచేసి వచ్చినవారు, మాస్కోకు దగ్గర త్రోవను చూపమని అతనిని అజ్ఞాపించారు. ఆతను వారికి దారి చూపడానికి ఒప్పుకొని, శత్రువుల ఉద్దేశాలను రష్యన్లకు చెప్పమని తన కుమారుడు వాన్యాను పంపించాడు.

ఆ కీకారణ్యంలో పోలులు హతమారిపోయారు. కాని సుసనిన్ కూడా ఆత్మార్పణ చేయవలసి వచ్చింది. వారి ప్రతీకారాన్ని ఆయన తప్పించుకోలేడు. వారు మంచుమీద అలసిపోయి కూలిపోయి నిద్రించారు; కాని సుసనిన్ నిద్రపోడు, ప్రభాతం అయ్యింది. తన బిడ్డలకూ, తన దేశానికీ, తన జీవితానికీ స్వస్తిచెప్పి సెలవు తీసుకున్నాడు.

సంగీత నాటకంలో చివరి దృశ్యం, మాస్కో. రెడ్‌స్క్వేర్ జనంతో కిక్కిరిసి వుంది. ఇదొక మహత్తరదినం. రష్యా మళ్ళీ దురాక్రమణ దారులనుండి విముక్తి పొందింది. కాని విజేతలైన సైనికులలో సుసనిన్ లేడు. ఆయన మరణించాడు, మాతృభూమి కొరకు ప్రాణత్యాగం చేసి.



19వ శతాబ్దంలో పీటర్స్‌బర్గ్‌లోని మరీన్‌స్కీ నాటకశాల

సంగీత నాటకపు అంతిమ బృందగాన శృతులమధ్య, రెడ్ స్క్వేర్లో గంటలు మ్రోగుతున్నాయి. అవి రష్యన్ ప్రజలను, వారి వీరులను కీర్తిస్తున్నాయి.

చివరి అంశం ముగిశాక తెరపడింది. కాని హర్షధ్వానాలు పదే పదే మారుమ్రోగుతున్నాయి. బాల్కనీలోని పై అంతస్థులోవున్న వారు హర్షధ్వానాలవల్ల చాందినీ దీపాలు మ్రోగుతూ వుండడం విన్నారు....

గ్లింకా సంగీతం బాల్యంలోనే మా జీవితాల్లో ప్రవేశించి, యావజ్జీవితమూ మాతో వుండిపోతుంది, రష్యన్ ప్రకృతిలోనూ, పుష్కిన్ గీతాలలోనూ వున్న ప్రేమలాగా. సోవియట్ దేశంలోని అనేక నగరాలలో గ్లింకాకు స్మృతి చిహ్నాలున్నాయి. నడి శీతకాలములో సైతం వాటి చలవరాతి వేదికలపైని ప్రభాత సమయ పుష్పాలు కనిపిస్తాయి, తన అమర కృతులను ప్రజల జీవితంలో అంతర్భాగంగా చేసిన తమ గొప్ప వాగ్గేయకారుని పట్ల ప్రజల ప్రేమకు చిహ్నంగా.

“ఇవాన్ సుసనిన్” అనే గ్లింకా సంగీత నాటకపు అంతిమ దృశ్యం





## యుద్ధనౌకల విడుదల

[13 వ పేజీ తరువాయి]

కాని ఒకొకప్పుడు గొప్ప యుద్ధనౌక. కాశీగావున్న డెక్కుపైకి వచ్చి, పూర్వం ఫిరంగిగొట్టాలు పెట్టబడిన పెద్ద కన్నాలను చూసి నప్పుడు యిది మాకు తెలిసింది.

ఈ మరణించిన యుద్ధనౌక ఎన్నో గొప్పగొప్ప పోరాటాల్లో పాల్గొంది. వేలాదిమంది నౌకాధికారులు దీనిలో శిక్షణను పొందారు. నాజీలు సోవియట్ దేశం పైని దాడిచేసినప్పుడు యిది కూడా ఆ వీర నగర అపూర్వ రక్షణలో దాగా పాల్గొన్నది. కాని యిప్పుడు బాల్టిక్ నౌకాదళ జాబితాలోనుండి అది తొలగింపబడింది.

ఈ యుద్ధనౌక నావికులు 424 వ నంబరు సెకండరీ పాఠశాలకు పూర్వం పోషకులుగా వుండేవారు. ఇప్పుడు వీడ్కోలు కానుకగా తమ నౌకనుండి కార్ఖానాలను బయటికితీసి ఆ పాఠశాలలో స్థాపించారు. మంచి పరిశ్రమలకు కూడా చాలావాటికి లేని కార్ఖానాలు యిప్పుడు 424వ నెంబరు పాఠశాల విద్యార్థులకు వున్నాయి.

ఈ పాత యుద్ధనౌక అధికారముద్ర కాల్చివేయబడి, దానిజండా దించివేయబడేరోజు, అది సోవియట్ నౌకాదళ గత చరిత్రలో మాత్రమే కనిపించేరోజు సమీపంలోనే వుంది.

## ప్రశ్నోత్తరాలు

(14వ పుట తరువాయి)

నమూ (టెక్నిక్) సోవియట్ వాణిజ్య సంస్థల నిర్మాణం, రకాలు గురించి, వాటి సామగ్రి గురించి ప్రస్తావిస్తాయి.

వృత్తిగా వాణిజ్యం కేవలం సంకుచితమైన ప్రత్యేక హంశాలకు మాత్రమే సంబంధించి వుండదు; యిందుకు సమీపంగా వున్న చాలాహంశాలలో—స్థూలదృష్టికి యివి దానితో ఎటువంటి సంబంధమూ లేనట్టుగా కనిపిస్తాయి—బోధన అవసరమవుతుంది. అంకౌట్సు, శానిటరీ ఇంజినీరింగును వుంచడం మాత్రమే కాకుండా, ఆర్థిక భూగోళశాస్త్రం, రసాయనిక శాస్త్రం, ఉన్నత గణిత శాస్త్రం, క్రిమి విజ్ఞానశాస్త్రం మూలవిజ్ఞానం వంటి హంశాలు యిదేవిధంగా ఉన్నత వాణిజ్య శిక్షణా సంస్థల విద్యాక్రమంలో చేర్చబడి వున్నాయి.

మంచి చిల్లర దుకాణాలలోనూ, టోకు వ్యాపార గిడ్డంగుల్లోనూ, నిలవల సంస్థల్లోనూ ప్రత్యక్షాధ్యయనం చేయడంవల్ల, విద్యార్థులు పట్టం పుచ్చుకోవడానికి ముందర తమ శక్తి సామర్థ్యాలను పరీక్షించుకునేందుకూ, తమ జ్ఞానాన్ని వినియోగించుకునేందుకూ అవకాశం కలుగుతుంది. ఆరు—తొమ్మిది మాసాల ప్రాక్టికల్ పాఠ్యక్రమంతో ఉత్తమమైన ప్రభుత్వ వాణిజ్య సంస్థల, అక్కడ పని చేస్తోన్న కార్యకర్తల అనుభం గురించి వారికి నేరుగా సమాచారం లభిస్తుంది.

చదువు పూర్తిచేసుకున్నాక పట్టభద్రులు వ్యాపార శాఖలకు అధిపతులుగానూ, ప్రభుత్వ వాణిజ్య సంస్థలలో డిప్యూటీ మానేజర్లు మొదలైన పెద్ద ఉద్యోగులుగానూ నియమింపబడతారు.

## ఉభయత్రా లాభదాయకమైన వ్యాపారం

(15వ పుట తరువాయి)

సోవియట్ విదేశ వ్యాపార సంస్థల ప్రతినిధులు, భారత దేశ వ్యాపారవర్గాలు ఒకరి దేశంలో మరొకరు జరిపే పర్యటనల ద్వారా సంబంధాలు ఇంకా విస్తృతం కావడము, ప్రదర్శనల యేర్పాటు, ఒకరి అవసరాలను మరొకరు బాగా అర్థం చేసుకోవడము, నిస్సందేహంగా వ్యాపారాన్ని అధికం చేయడానికి, మరిన్నియెక్కువ రకాల వస్తువుల కొనుగోలుకు దారితీయగలవు.

పద్దులను రూపాయల్లో పరిష్కరించుకోడానికి సోవియట్ దేశం అంగీకరించడము, భారతదేశం, సోవియట్ దేశాలమధ్య క్రమమైన నౌకారాకపోకలు ఉండడము సోవియట్ దేశం, భారత దేశాల మధ్య వ్యాపారాభివృద్ధికి తోడ్పడతాయి. దేశాలు పరస్పరం ఖరీదు చేసే వస్తువుల విలువ సమానంగా వుండే ప్రాతిపదికమీద, బ్యాలెన్సు వ్యాపారంకొరకు ఉభయపక్షాలు ప్రయత్నించడం పరస్పర లాభదాయకమైన భారత-సోవియట్ వాణిజ్యాభివృద్ధికి ముఖ్యంగా తోడ్పడగలదు. ఈ ఆకాంక్షగూడా ఎ. ఐ. మికొయాన్ భారత దేశాన్ని సందర్శించినప్పుడు వెల్లడింపబడ్డది. ఆయన ఇలాఅన్నారు:

"సోవియట్ దేశం తాను భారత దేశంతో జరిపే వ్యాపారం మీద, డబ్బు చెల్లింపుమీద భారం వేయదలుచుకోదు. అందువల్ల మేము భారత దేశంలో సోవియట్ వస్తువుల అమ్మకంవల్ల వచ్చే మొత్తాలతో భారతీయ ముడినరుకులను, ఉత్పత్తి చేయబడిన సరుకులను కొనుక్కొంటాము."

సోవియట్ దేశం, భారత దేశాలమధ్య 1956 లో జరిగిన వ్యాపారం 30 కోట్ల రూపాయల విలువగలదై వుంటుందని ప్రాథమిక అంచనాలు తెలుపుతున్నాయి. ఈ మొత్తం చాలా పెద్దదికాదన్న మాట వాస్తవమే. కాని 1953లో, అనగా వ్యాపార ఒడంబడిక జరగడానికి ముందు, సోవియట్ దేశం, భారత దేశాల మధ్య కోటి రూపాయల విలువగల వ్యాపారం మాత్రమే జరిగింది.

సోవియట్ దేశం, భారత దేశాలమధ్య పరస్పర లాభదాయకమైన వ్యాపార సంబంధాలు వృద్ధిపొందడానికి అవసరమైన పరిస్థితులన్నీ వున్నాయని యీ సందర్భంలో నేను చెప్పవలసి యున్నది.

## మాస్కోలో భారత దేశపు తేయాకు

(16వ పుట తరువాయి)

రుచిచూడవలసి వచ్చింది). అలా తాగుతూ వుండగా ప్రధాన 'టీ టేస్టర్' నికొలాయ్ ఫోమిచేవ్ మాకు భారత తేయాకుని గురించి వివరముగా తెలియజేశారు. సోవియట్ దేశంలో భారతీయ తేయాకుకు చాల గిరాకీ వున్నదని చెప్పారు. "భారతీయ తేయాకు ఉన్నదా? అమ్మకానికి యెప్పుడు వస్తుంది?", అన్న మాటలు దుకాణాలలో తరుచు వినవస్తుంటాయి. చక్కని పరిమళంతో కూడిన యీ పానీయాన్ని ప్రీతితో తాగుతూ ఆ తేయాకును పండించిన ప్రజల దేశాన్ని గురించి యెంతో కృతజ్ఞతతో తలచుకొంటుంటారు.

## జాతీయాభివృద్ధిపై నివే.

(1వ పుట తరువాయి)

ఆర్థికరంగానికి సంబంధించిన అన్ని శాఖలు విద్యుచ్ఛక్తిమీద ఆధారపడి వుంటాయి: విద్యుచ్ఛక్తి లేకపోయినట్లయితే ఆధునిక పరిశ్రమలు నిలవలేవు. గత సంవత్సరం సోవియట్ విద్యుచ్ఛక్తి పరిశ్రమలో గొప్ప విజయాలు సాధింపబడ్డాయి. ఈ మధ్యగడిచిన కాలాన్ని పరిశీంచినట్లయితే యీ అభివృద్ధి స్పష్టంగా గోచరిస్తుంది. సోవియట్ వ్యవస్థ యావత్తు రష్యాలోను, దాని పరిశ్రమలు, వ్యవసాయంలో, విద్యుచ్ఛక్తిని ప్రవేశపెడుతుందని లెనిన్ జోశ్యం జెప్పారు. ఈ విషయం, దేశంలోని విద్యుచ్ఛక్తి ఉత్పత్తి 5,000 మిలియన్ల కిలోవాట్-గంటలైనాలేని 30 సంవత్సరాలక్రితం చెప్పబడింది. 1956లో సోవియట్ విద్యుచ్ఛక్తి యంత్రాలు 192,000 మిలియన్ల కిలోవాట్-గంటల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసాయి.

కేపిటల్ నిర్మాణాలు పెద్దపెట్టున జరగడం, దేశం యొక్క ఉత్పాదన శక్తులు త్వరితగతిని పెంపొందుతున్నాయనడానికి మరొక సూచన. గత సంవత్సరంలో ఎనిమిదివందలకుపైగా భారీ, లఘు పరిశ్రమలకు సంబంధించిన ప్రభుత్వ యంత్రాగారాలు ప్రారంభింపబడ్డాయి.

భారీ పరిశ్రమల అభివృద్ధి సోవియట్ ప్రభుత్వానికి వ్యవసాయ రంగంలో ముఖ్యమైన అభివృద్ధిని సాధించడానికీ, నిత్యవినియోగ వస్తువుల మొత్తం ఉత్పత్తిని అధికం చేయడానికీ తోడ్పడ్డది. కోట్ల కొలది హెక్టార్ల (ఒక హెక్టర్ 2.47 ఎకరాలు) బీడు భూమి సాగులోనికి తీసుకొనిరాబడింది. గత మూడు సంవత్సరాలలో దాదాపు 38 మిలియన్ల హెక్టర్ల భూమి సాగులోనికి తేబడింది. 1956 లో రైతాంగం దేశ చరిత్రలోకల్లా అత్యధికమైన పంటను పండించింది. 1956 లో మొత్తం ధాన్యం పంట 1955వ సంవత్సరం పంటకంటే 20 శాతం యెక్కువ జరిగింది. సమిష్టి ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు 52,864,000 టన్నుల ధాన్యాన్ని ప్రభుత్వానికి అమ్మి, సరఫరా చేసాయి. 1956లో జరిగిన గణనీయమైన ప్రత్తిపంట మొత్తం 4.3 మిలియన్ల టన్నులు. పశుపక్ష్యాదుల సంబంధమయిన పదార్థాల ఉత్పత్తి గూడా బాగా అభివృద్ధి అయింది.

భారీ పరిశ్రమలు రైతులకు అవసరమైన యంత్రాల నన్నిటిని సరఫరా చేస్తూ రావడం మూలాన వ్యవసాయ రంగంలో యీ విజయాలు సాధ్యమయ్యాయి. ఒక్క 1956వ సంవత్సరంలోనే సోవియట్ వ్యవసాయ రంగానికి 248వేల ట్రాక్టర్లు (15 హార్సు పవర్ యూనిట్ల పరిమాణంలో) 114వేల లారీలు, లక్షలకొలది వ్యవసాయ యంత్రాలు పరికరాలు సరఫరా చేయబడ్డాయి.

నిరుద్యోగం లేకపోవడము, జాతీయ ఆర్థిక రంగంలో పని చేస్తున్న పారిశ్రామిక కార్మికులు, కార్యాలయోద్యోగుల సంఖ్య నానాటికి అధికమవుతూ వుండడము కూడా సోవియట్ ఆర్థిక విధానము గట్టి పునాదిపైన పెంపొందుతున్నదనడానికి ఒక సూచన. 1956 లో వీరిసంఖ్య 50 మిలియన్లకు పెరిగింది. అంతకుముందు సంవత్సరం కంటె 2.1 మిలియన్ల మంది యెక్కువన్నమాట.

గత సంవత్సరం ప్రజా సంక్షేమంలో తగినంత అభివృద్ధి సాధింపబడింది. సోషలిస్టు ఆర్థిక విధానంలో, ప్రజానీకంయొక్క జీవన సాంస్కృతిక ప్రమాణాల అభివృద్ధి, సాంఘికోత్పత్తిలో సాధింపబడిన విజయానికి అనుగుణ్యంగా వుంటుంది గాబట్టి, ఈ అభివృద్ధి సహజమైనదే. ప్రస్తుతం సమీక్షింప బడుతున్న కాలంలో ఫ్యాక్టరీల, కార్యాలయాల కార్మికుల వేతనాలు నూటికి మూడుపాళ్లు యెక్కువయ్యాయి; శ్రామిక ప్రజలకు పెన్షన్లుగాను, తదితర విధాల చెల్లింపబడిన మొత్తం 19 శాతం పెరిగింది; రైతాంగపు ఆదాయం 12 శాతం యెక్కువయింది. తక్కువ వేతనాల కార్మికుల, కార్యాలయోద్యోగుల వేతనాలు ఒకటింట మూడవవంతు అధికమయ్యాయి; సెకెండరీ పాఠశాలలు, ఉన్నత విద్యాలయాలలో జీతాలు రద్దుచేయబడ్డాయి; వేతనాల్లో తగ్గుదల లేకుండా ఏడుగంటల పనిదినం ప్రవేశపెట్టబడబోతున్నది; ఇలా ఇంకాఅనేకం జరిగాయి. పై నుదహరించిన చర్యల మూలంగా ప్రజానీకం పొందే ప్రయోజనాలకొరకై మొత్తం 35,000 మిలియన్ల రూబుళ్ళు వ్యయ మవుతాయి.

ఆరవ పంచవర్ష ప్రణాళిక మొదటి సంవత్సరపు దేశ ఆర్థిక నివేదిక, పంచవర్ష ప్రణాళిక విజయవంతంగా పరిపూర్తి గావింప బడుతున్నదని తెలియజేస్తుంది.



నగిషీపని చేస్తోన్న కళాకారిణులు (26-31 పుటల వ్యాసం చూడండి)

---

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ తరపున, జి. ఎఫిమోవ్‌చే 25, బారాకంబా రోడ్, న్యూ ఢిల్లీ నుండి సంపాదితము, ముద్రితము, ప్రచురితము. ముద్రాపకులు: పంజాబీ ప్రెస్, సదర్ బజార్, ఢిల్లీ.

